# దేశం బాగుపడాలంటే

(నాటికల సంపుటి)



ఆచార్య ఎస్. గంగప్ప

శశీ ప్రచురణలు
సుధర్మ
సి/73, శ్రీనివాసనగర్ కాలనీ
గుంటూరు–522 006

**DESAM BAGUPADALANTE**

**[COLLECTION OF PLAY LETS]**

దేశం బాగుపడాలంటే

(నాటికల సంపుటి)


ఆచార్య ఎస్. గంగప్ప, ఎం.ఎ., పిహెచ్.డి.

విశ్రాంతాచార్యులు, తెలుగు ప్రాచ్యభాషా విభాగం,
నాగార్జున విశ్వవిద్యాలయం
నాగార్జుననగర్–522 006





ప్రథమ ముద్రణ : మార్చి, 1997

ప్రతులు : 500

వెల : రూ॥ 30/–

ముఖపత్రచిత్రణ : దేవీప్రసాద్

ప్రతులకు :

శ్రీమతి ఎస్. పార్వతమ్మ
సుధర్మ
శశీప్రచురణలు
C/73, శ్రీనివాసనగర్ కాలనీ,
గుంటూరు–522006
ఫోన్ : 231805

ముద్రణ :

శ్రీ లక్ష్మీగణపతి ప్రింటర్స్,
5/1, బ్రాడీపేట,గుంటూరు–522 002

# విషయసూచిక

నాంది :

# కళాభినందన

'అమూల్యశ్రీ'
జె. అమ్ములయ్య
6/12, బ్రాడీపేట, గుంటూరు-2

విద్యారంగంలో ఉత్తమాధ్యాపకునిగా, విశిష్టాచార్యునిగా, సాహితీ రంగంలో పదసాహిత్యపరిశోధకుడిగా ఆచార్య ఎస్. గంగప్పగారు తనకొక 'ప్రముఖస్థానాన్ని' సముపార్జించుకొని, లబ్ధప్రతిష్ఠులైనారు. అయితే, పద, జానపద, నాటక, పరిశోధన, విమర్శలందేకాదు అర్వాచీనాంధ్ర సాహిత్య ప్రక్రియలైన కవిత్వం, కథ, నవల, నాటిక నాటకరచనలందూ ఆచార్య గంగప్పగారు ప్రతిభాశాలి యని ఆయన సృజనాత్మకరచనలు చదివితే తెలుస్తుంది. అయితే పదసాహిత్య పరిశోధనలో మునిగితేలుతూ, తన సృజనాత్మకతపై ఆయనంతగా మనస్సు లగ్నంచేయలేదు సరికదా రాసిన సృజనాత్మక రచనలను ముద్రించటానికి సమయం, ఆసక్తి అంతగా లేక పోవడం వల్ల అవి 'వ్రాతప్రతులు'గానే యిన్నాళ్ళూ మూలుగుతూ మూలనబడి వుండిపోయాయి. అయితే పదవీవిరమణచేసిన తర్వాత తీరిక దొరకడంవల్ల, మూలనపడున్న రచనల్ని బయటికితీసి దుమ్ముదులిపి అచ్చువేయించటానికి పూనుకొన్నాడు. అలా అచ్చుకునోచుకొన్న రచనల్లో "అంతరంగతరంగాలు, కవితాసంపుటి- దేశం బాగుపడాలంటే" అనే నాటికాసంపుటి మచ్చుతునకొన్ని.

ఈ నాటికాసంపుటిలో 'తిరస్కృత' తప్ప, మిగిలినవన్నీ సమకాలీన సామాజిక సమస్యలకు ప్రతిబింబాలే ! 'తిరస్కృత'లో సాళ్వరాజు ప్రేమించిన 'అంబ'ను భీష్ముడు బలవంతంగా అంబిక, అంబాలికలతోపాటు యెత్తుకొని పోవడం, ఆమె మనస్సును తెలుసుకొన్న భీష్ముడు తల్లి సత్యవతిమాటను

మన్నించి ఆమెను వదలివేయడం, మరలివచ్చిన 'అంబ'ను సాళ్వరాజు "పరపురుషపరిగ్రహీత"యై నందున, ఆమెను స్వీకరించడం 'ధర్మవిరుద్ధం' 'సంప్రదాయవిరుద్ధమ'ని తిరస్కరించడం, రెండువిధాలాచెడిన 'అంబ' తన దుస్థితికి కారణభూతుడైన భీష్మునిపై పగబూని "అబల ఆగ్రహించిన ఏమైనా చేయగలదని నిరూపిస్తాను." భీష్ముని సాధించితీరుతాను" అని ప్రతిజ్ఞచేయడం- ఈ నాటికలోని ముఖ్య కథాంశం. ఇది మహాభారతంలోని కథాఘట్టం. ఇది పురాణ కథాంశం గనుక, సంప్రదాయానుసారం ఆచార్యులవారు ఇందులో సంప్రదాయక ఛందోబద్ధ పద్యాల్ని మూడునాల్గు గూడా చేర్చాడు. ఈనాటిక ఆలిండియారేడియో హైదరాబాదుకేంద్రం నుండి వెలువడింది.

"దేశం బాగుపడాలంటే" అనే మరో నాటిక ఈ నాటికా సంపుటిలో 'శిఖరాయ'మానమైనది. దొంగవ్యాపారస్తులు, వచ్చిన ప్రతి ఆఫీసర్ని 'లంచం'తో లోబరచుకొని తమ మాటవినని ఆఫీసర్లను బెదరిస్తూ తమ యిష్టారాజ్యంగా దొంగవ్యాపారం చేసి, ప్రజల్ని దోచుకొంటూ, అక్రమార్జన చేస్తూ కోట్లకుపడగలెత్తుతున్న ఈనాటి సమాజంలో 'నీతిమంతుడైన ఓ సేల్సుటాక్సు ఆఫీసరు, తన బాల్యస్నేహితుడైన సి. ఐ. డి. ఇనస్పెక్టర్ సహాయంతో - దొంగ వ్యాపారస్తుల 'లంచం' వ్యామోహంలోపడకుండా - వారు చేస్తున్న నల్లబజారు దొంగ వ్యాపారాన్ని దొంగనోట్ల వ్యాపారాన్ని బట్టబయలుచేయడం – ఈ నాటికలోని ముఖ్య కథాంశం. "లంచగొండి తనాన్ని పోగొట్టాలంటే లంచం తీసుకొనే ఉద్యోగుల్ని శిక్షించడమేకాదు. లంచగొండితనాన్ని ప్రోత్సహించే ప్రజానీకంపైగూడా తగిన కఠిన చర్యలు తీసుకోవాలి. .. అప్పుడే లంచగొండితనం పోతుంది ... ఈ రెండుపద్ధతుల్ని అనుసరిస్తే తప్ప దేశంబాగుపడదు." అన్న గొప్ప సందేశం ఈనాటిక ద్వారా యిస్తారు ఆచార్యులవారు. నిజమే వ్యాపారస్తులు నిజాయితీగా వ్యాపారంచేస్తే- అధికారులకు లంచం అడిగేదమ్ములుండవు గదా ! తమ అక్రమార్జనకు - స్వార్థానికి వ్యాపారస్తులే పోటీపడి 'అధికారులను' నాయకులను 'లంచాలతో' లోబరచు కొంటున్నారు. కనుక అవినీతి, లంచగొండితనం పోవాలంటే ముందు వర్తకుల్లో ప్రజల్లో నిజాయితీ గల చైతన్యంరావాలి. గంగప్పగారి

ఆశయం ఆకాంక్ష అదే. ఈనాడు రాజకీయ నాయకుల్లో, అధికారుల్లో చివరకు న్యాయమూర్తుల్లో గూడా అవినీతి లంచగొండితనం పెరిగిపోయి 'హవాలా' కుంభకోణాలు, 'పలురకాలైన స్కామ్‌లు' రోజూ దినపత్రికల్లో చదివి సామాన్యప్రజానీకం ముక్కుమీదవేలేసుకొంటుంది. నాయకుల్ని, అధికారుల్ని 'ఛీ' కొడుతోంది. ఏనాడో (1964 సం॥లో) గంగప్పగారు రాసిన ఈ నాటిక నేటికీ, యేనాటికీ, 'అవినీతి' దురాచారనిర్మూలన సందేశ మిస్తుంది. అవినీతిపరుల కీ నాటిక ఓ చెంపపెట్టు ! ఈ నాటికలోని 'జవాను భీమన్న, సుందర్‌లాల్ సేఠ్‌జీ, కూర్మయ్యశెట్టి' సంభాషణలు పాత్రలకు తగ్గట్టుగా ఉండి సున్నితమైన హాస్యాన్ని సంతరిస్తాయి. చెవిటి జవాన్ భీమన్న సమాధానాలు నవ్వు కలిగిస్తాయి. మంచి సందేశంతోపాటు బిగువైన కథాంశంతో మన్నితమైన హాస్యపూరిత సంభాషణలు గల ఈ నాటిక ప్రేక్షకుల్ని అలరింపజేస్తాయి. విద్యాసంస్థలలోనేకాదు బహిరంగవేదికల్లో గూడా ఈ నాటికను ప్రదర్శింపవచ్చు. అవినీతికి వ్యతిరేకంగా ప్రజాబాహుళ్యాన్ని చైతన్యవంతుల్ని చేయటానికి సందేశాత్మకమైన ఈ నాటిక ఎంతేని దోహదపడుతుంది.

"ప్రగతి" అనే నాటిక గూడా ఉదాత్త సందేశాత్మకం. ఇది దేశాభ్యుదయానికి సంబంధించింది. ఇందులోని పాత్రలు ఆయా అంశాలు(విషయాలకు) ప్రతీకలు. 'సంప్రదాయరావు'– సనాతన సంప్రదాయానికి, వాస్తవాలు గ్రహించలేని హ్రస్వదృష్టికి ప్రతీక. దేశం స్వాతంత్ర్యం వచ్చి ఇన్నేళ్ళయి దేశంలో ఏ విధమైన ప్రగతిలేదని ఈ సంప్రదాయరావు వాదన. ఇక ఈయన కుమారుడు 'చైతన్యం' పేరుకుతగ్గట్లు అభ్యుదయభావాలుకలవాడు– స్వరాజ్యం వచ్చాక–దేశం ఎంతో ప్రగతి సాధించిందని, విద్య, వైద్య, వ్యవసాయక, సాంకేతిక, శాస్త్రీయరంగాల్లో బడుగువర్గాల సంక్షేమరంగాల్లో దేశం ముందడుగువేస్తూ 'అభ్యున్నతి' పథంలో సాగుతుందంటాడు. ఇక "ప్రకాశరావు" తన ఆస్తినంతా వ్యయించి దేశాభ్యుదయానికి అవసరమైన 'ప్రణాళికలు' ప్లాన్లు తయారు చేస్తుంటాడు. తన సహోదరి 'స్వరాజ్యం' (సంప్రదాయరావు కుమార్తె)ని' ప్రకాశరావుకిచ్చి వివాహం చేయాలని

'చైతన్యం' ఆకాంక్ష. మొదట తండ్రి సంప్రదాయరావు ఈ వివాహానికి అంగీకరించకపోయినా చివరకు అంగీకరించక తప్పలేదు. కారణం, స్వరాజ్యం గూడా ప్రకాశరావుపై మనస్సుపడుతుంది. వివాహానికి అంగీకరిస్తుంది.

'చైతన్యం' ప్రమేయంతో 'స్వరాజ్యం' – 'ప్రకాశరావు'లకు వివాహం జరగడం అంటే – "చైతన్యం"వలె దేశస్థులందరు 'చైతన్యవంతులై' అభ్యుదయకాములైతే- సంప్రదాయరావు వంటి సనాతన మూఢనమ్మకాల్ని ద్రోసిరాజని, ప్రణాళికాబద్ధంగా దేశం అభ్యుదయ పథంలో పురోగమిస్తుందనీ,

అప్పుడే స్వరాజ్యం (స్వాతంత్ర్యం) అర్థవంతమౌతుందని, అభ్యున్నతి సాధిస్తుందని ఆచార్య గంగప్పగారీనాటికలో గొప్ప సందేశాత్మక 'ప్రతీక వాదం' (సింబాలిజం) ప్రవేశపెట్టాడు. స్వరాజ్యం - ప్రకాశరావులకు పుట్ట బోయే బిడ్డకు 'ప్రగతి' నామకరణం చేస్తామంటారు. స్వతంత్రభారతం ప్రణాళిక బద్ధంగా ముందుకు సాగితే, దేశానికి 'ప్రగతి' సంతరిస్తుందిగదా ! ఈ నాటిక ద్వారా, దేశాభిమానంగల ఆచార్యుల వారు ప్రజల్లో దేశాభిమానాన్ని, దేశాభ్యుదయాకాంక్ష ప్రేరేపించడం, అభినందనీయం.

"క్రాంతి" అనే నాటకం గూడా ఉన్నతాశయ ప్రబోధితం. కుటుంబ నియంత్రణ ఇందలి ఇతివృత్తం. అరడజను ఆడపిల్లల తండ్రి అయినా, వంశోద్ధారకుడైన 'సుపుత్రుడు' కలగాలన్న కోరికయున్న అత్తగారు, భార్యామణులమాట కాదనలేని సుందరరావును'కుటుంబనియంత్రణ'ఆపరేషను చేయించుకోమని హెచ్చరిస్తుంటాడు మిత్రుడు కృష్ణారావు, అయినా మిత్రుని మాట మన్నించడు సుందరరావు. భార్య 'క్షమ' మరలా గర్భవతి అవుతుంది. ఆమె ప్రసవసమయానికి సుందరరావు ఆఫీసరుతో కలిసి గ్రామాంతరం వెళ్ళతాడు. ఆస్పత్రిలో చేరిన సుందరరావు భార్య మరలా ఆడపిల్లనే కంటుంది ! కాలేజీ ఫీజు చెల్లించటానికని తండ్రి యిచ్చిన డబ్బును, వాళ్ళ పెద్దకుమార్తె 'క్రాంతి' ఆస్పత్రి ఛార్జీలక్రింద ఖర్చుపెడుతుంది. మరలా ఆడపిల్లపుట్టడం యింటిల్లిపాదికీ బాధ కలిగిస్తుంది. క్యాంపు నుండి వచ్చిన

సుందరరావు మరలా మరొక ఆడపిల్లకు తండ్రినయ్యానని తెలుసుకొని, బాధ పడి, యెవరికీ చెప్పకుండా ఆస్పత్రికిపోయి పిల్లలు పుట్టకుండా 'వ్యాసక్టమీ' ఆపరేషన్ చేయించుకొని యింటికివస్తాడు. పెద్దకుమార్తె, తల్లిదండ్రులతో, తాను ఉన్నతవిద్య నేర్చుకొని, ఉద్యోగంచేస్తూ, కుటుంబపోషణలో తండ్రికి చేయూతగా ఉంటాననీ, కట్నంకోరని యువకునే వివాహమాడతాననీ, అట్టి యువకుడు దొరికేవరకు తాను అవివాహితగానే ఉంటాననీ "వరకట్నం ఇచ్చేవాళ్ళు, తీసుకొనేవాళ్ళు ముఖ్యంగా (పెళ్ళికావలసిన) ఆడపిల్లలు ఈ దురాచారాన్ని ఎదిరించాలి· అప్పుడే సంఘం బాగుపడుతుంది" ఆడపిల్లల బ్రతుకులు బాగుపడతాయనీ భరోసా ఇస్తుంది. "నీవు మా కుర్తెవుకాదు కుమారుడవే" అన్న వాళ్ళ అమ్మమ్మమాటలతో ఏకీభవిస్తూ ఆనందిస్తారు తల్లిదండ్రులు.

ఆచార్య గంగప్పగారీ పెద్దనాటికను సరికొత్తపంథాలో వెలయించాడు; కొత్తటెక్నిక్ ప్రవేశపెట్టాడు. మొదటిరంగంలో సమాచారశాఖ ఫీల్డు సిటీ ఆఫీసరును ఆకాశవాణి డైరక్టరును ప్రవేశపెట్టి పంటలు ఎంత ఎక్కువగా పండించినా పరిశ్రమలు ఎన్ని నెలకొల్పినా నిరుద్యోగమనే పీడ దేశాన్ని వేధిస్తూందని, అందుకు కుటుంబనియంత్రణ మొక్కటే ఉత్తమ పరిష్కార మార్గమనీ "చిన్నకుటుంబమే చింతల్లేని కుటుంబమనీ, ఇద్దరుపిల్లలే ముద్దనీ, మంది ఎక్కువైతే మజ్జిగ పల్చనవుతుందని వారిచేత ముందు చెప్పిస్తాడు. అదేసమయంలో పిల్లలు ఎక్కువైనందువల్ల కుచేలునిపాట్లు చెప్ప పనిలేదనీ, "కుచేలోపాఖ్యానం" సంగీత రూపకాన్ని వినిపిస్తాడు. కుచేలోపాఖ్యానం పూర్తి అయిన తర్వాత సుందరరావు కుటుంబగాథ రేడియోరూపకాన్ని ప్రారంభిస్తూ "రెండు మంచి గులాబీలు మిన్న, పదిరెండువేల గుడ్డిగులాబీల కన్న" అనేపాటను అవి "అచ్చపు సంసారానికి సంకేతమన్న" పాటను వివిపింపజేస్తాడు.

దేశజనాభా విపరీతంగా పెరిగిపోతున్న ఈ రోజుల్లో ఈ 'కుటుంబ నియంత్రణ' సందేశాత్మకరూపకం ఆచార్య గంగప్పగారు వెలువరించిడం అభినందనీయం. ఈ నాటికల్లో గూడా ప్రతీకవాదం ప్రవేశపెట్టాడు గంగప్ప

గారు. రెండు మంచి గులాబీలు ఇద్దరు పిల్లలకు సంకేతం: కుచేలోపాఖ్యాన రూపకం-, పిల్లలెక్కువున్న కుటుంబాలకు ప్రతీక. కుచేలుణ్ణి శ్రీకృష్ణుడు ఆదుకొన్నట్లు, పెద్ద సంసారికుడు, చిన్న ఉద్యోగి, పేదవాడైన సుందరరావును వ్యాపారమిత్రుడు కృష్ణమూర్తి ఆదుకొంటాడు. అభ్యుదయభావాలు గల పెద్ద కుమార్తె "క్రాంతి" స్త్రీజనంలో రావాల్సిన మార్పుకు సంకేతం, మరో ముఖ్య గమనిక. పురుషాధిక్యతపై మహిళాలోకం తిరుగుబాటు ధోరణిలో 'స్త్రీవాద' సాహిత్యం పుంఖానుపుంఖంగా వస్తోంది. అంటే మహిళలు విద్యావంతులై చైతన్యవంతులై 'పురుషాహంకారాన్ని' నిరసిస్తూ "మార్పు" కోరుతున్నారన్న మాట. ఆచార్య గంగప్పగారు ఈ నాటిక ద్వారా మూడు దశాబ్దాలకు పూర్వమే" మహిళాలోకంలో "మార్పు" (క్రాంతి) పాత్ర ప్రవేశపెట్టారు.

ఇక మిగిలిన నాటికలు గూడా సమకాలీన సామాజిక సమస్యలకు, ఆధునికమానవుల మనస్తత్వాలకు అద్దంపడతాయి.

'లీల' నాటికలోని ఇతివృత్తం యువతీయువకుల మధ్య ప్రేమ. తన ప్రేయసి మరొకనిని వివాహమాడబోతోందని తెలుసుకొన్న ఒక ప్రేమికుడు ముందు నిరాశానిస్పృహలకు గురిఅయినా మిత్రుని సహాయంతో తన ప్రేయసికి కాబోయే భర్త వేషంలో తన ప్రేయసి తన దగ్గరకు రావడంతో కథ సుఖాంతమౌతుంది: ఈనాటి యువతీయువకుల్లో సర్వసాధారణంగా నడుస్తున్న 'ప్రేమాణయం' ఇతివృత్తం తీసుకొని గంగప్పగారు రసవత్తరంగా నాటిక వెలయించాడు. తాను ప్రేమించిన అమ్మాయిని పెండ్లాడబోయే మరొక యువకుడు తన దగ్గరకువస్తే, తన సేవకుని సహాయంతో అతగాణ్ణి చంపుతామని బెదరించి చివరకు తన ప్రేయసియే పురుషవేషంలో వస్తే అది తెలుసుకొన్న ప్రియుడు సంభ్రమాశ్చర్యాలతో - సంతోషంతో సిగ్గుతో ఆమెను క్షమించమని అడగినట్లు - గంగప్పగారు నాటికను రసవత్తరంగా మలిచాడు. ప్రేయసి మారువేషంలో వచ్చి ప్రియుని ప్రేమను పరీక్షించడం గంగప్పగారు ప్రవేశపెట్టిన రసవత్తర ఘట్టం ! "పునర్యౌవనం" నాటిక విజ్ఞాన శాస్త్రీయ

తాంత్రిక ఇతివృత్త ప్రధానమైనది. తాను ప్రేమించే పెండ్లి చేసుకున్న ప్రేయసి అకాలమరణంచెందితే, ఆమె తన ప్రేమచిహ్నంగా ఇచ్చిన, 'రోజా' పుష్పం వాడిపోకుండా ఉండేందుకు శాస్త్రవేత్త అయిన డా॥ సదానందం 'నూతనోత్తేజం' "నవయౌవనం" ఇచ్చే ఒక క్రొత్తద్రవం ('పౌంటైయిన్ ఆఫ్ యూత్') ఫ్లొరిడా ద్వీపకల్పం దక్షిణభాగానున్న 'మెకాకో' సరస్సునుండి స్నేహితుడొకరు పంపాడంటాడు. ఒక వ్యాపారస్థుడు, ఒక రిటైర్డు మిలిటరీ కర్నల్, ఒక రాజకీయనాయకుడు, వయస్సుమళ్ళిన ఓస్త్రీ ఈ శాస్త్రవేత్త దగ్గరకు వచ్చి ఆ వింతద్రవాన్ని త్రాగి దాని ప్రభావం - మైకంతో ఉద్రేక, పూరితులై, నూతనోత్సాహంతో తామంతా "యౌవన"వంతులైనట్లు భ్రమించి వూహాలోకంలో పరవశత్వంతో ఆనందడోలికల్లో తేలిపోతారు. ఆద్రవం మైకం తగ్గిపోగానే మరలా మామూలుస్థితికి వస్తారు. ఆద్రవం ఇంకా కావాలంటారు. తనదగ్గరలేదని అదికావాలంటే ఫ్లొరిడా ద్వీపకల్పం వెళ్ళ మంటాడు. విజ్ఞానశాస్త్ర మెంతగా అభివృద్ధిచెందినా, జీవితాన్ని సుఖవంతం చేయటానికి ఎన్నిమార్గాలు కనుగొన్నా - ప్రాణి, (మానవుడు) కాలపరిణామ క్రమాన్ని అధికమించలేడని. మృత్యువుని జయించలేడని 'బాల్యం తర్వాత యౌవనం: దానివెనువెంట జరామరణాలు ప్రతిప్రాణికి సహజమని' నిత్య సత్యాన్ని ఈనాటికద్వారా ప్రకృతి ధర్మాన్ని గుర్తుచేస్తాడు ఆచార్యులవారు. ఇకపోతే **'Dr. HEIDEGER'S EXPERIMENT'** అనే కథాధారంగా రేడియో రూపకంగా ఆచార్య గంగప్పగారు రమణీయంగా మలిచాడు. ఇది హైదరాబాద్ ఆకాశవాణి కేంద్రం ద్వారా ప్రసారమైంది.

"ఉపాయం" నాటికలో వూరుచివర నివసించే గృహంలో దొంగలు పడితే, దొంగలకు తెలివిగా రోల్డుగోల్డునగలు, దొంగనోట్లు ఇచ్చి 'ఉపా యంగా అపాయం నుండి' తప్పించుకొన్న ఓ దంపతుల కథాఘట్టం ఇందలి ఇతివృత్తం. 'సమయస్ఫూర్తి గల తెలివి, ఉపాయం ఉంటే' ఎంతటి అపా యాన్ని అయినా,ఎంతటి క్లిష్టపరిస్థితులనైనా తప్పించుకొనగలనన్న సందేశ మిందులో ఉంది.

చివరగా "చిగురించినమోడు" నాటికలో - హఠాత్తుగా వచ్చిన తుఫానులో తమ ముగ్గురు సంతానం గల్లంతు అయిపోతే తల్లిదండ్రులు బిడ్డల కోసం పడిన ఆవేదన, చివరకు ఒక్క 'చంటివాడు' తిరిగిరావడం - బిడ్డల కోసం అరచి అరచి గొంతుపోయిన తండ్రికి 'చంటివాణ్ణిచూచి' "బాబూ బాబూ' అని ఆనందాతిశయంతో అరవడంతో చివరకు 'గొంతు'రావడం ఇందలి ఇతివృత్తం. ముగ్గురిలో ఒక బిడ్డ అయినా జీవించి తమకు దక్కడం తండ్రికి పోయిన 'గొంతు' రావడం-ఈనాటిక 'చిగురించినమోడు'కు ప్రతీక!

ఇలా సమకాలీన సామాజిక రుగ్మతల్ని ఇతివృత్తాలుగా స్వీకరించి సందేశాత్మక రూపకాలుగా, నాటికలుగా ఆచార్య గంగప్పగారు మలచడం ముదావహం. నాటక,పద, జానపద సాహిత్య పరిశోధకుడు, విమర్శకుడుగా పేరొందిన గంగప్పగారు ఈనాటికద్వారా తనకున్న 'సామాజిక స్పృహ'ను స్పష్టపరిచాడు. నాటికలన్నీ సరళమైన వ్యావహారిక భాషలో వ్రాసాడు. బిగువైన పాత్రోచిత సంభాషణలు, సందేశాత్మక కథాంశాలు పాఠకుల్ని ఆకట్టుకొంటాయి. ఏనాటికలోను, ఏపాత్రచేతగూడా విసుగుపుట్టించే 'సుదీర్ఘ' సంభాషణలు చెప్పించకపోవడం గంగప్పగారి విజ్ఞతకు నిదర్శనం! అయితే కొన్ని నాటికలకు, గంగప్పగారు, పాత్రల స్వరూప స్వభావాలను, వాటి సంబంధ బాంధవ్యాలను, ముందుగా పరిచయం చేయలేదు. పరిచయం చేసి ఉంటే చదువరులకుగాని, ప్రదర్శకులకుగాని ఎంతో ఉపయోగకరంగా ఉండేది.

కోలాచలం శ్రీనివాసరావు నాటక సాహిత్య పరిశోధన చేసి సిద్ధాంత వ్యాసం రాసి డాక్టరేటుపొందిన ఆచార్య గంగప్పగారు 'తెలుగు నాటక' సాహిత్యపై గూడా పరిశోధనచేసి, నాటక సాహిత్య పరిశోధకుడుగానే ఉండి పోక 'పదకవితా పితామహుడు' వంటి నాటకాలు, "దేశం బాగుపడాలంటే" వంటి సాంఘిక నాటకం వెలయించి, "నాటకకర్త"గా గూడా తన ప్రతిభా పాటవాలు ఋజువుచేసుకొన్న ఆచార్య గంగప్పగారి కళాత్మకు నాహృదయ పూర్వక 'కళాభినందన'లు:

ఈనాటికాసంపుటి గ్రంథాన్ని ఆచార్య గంగప్పగారు, శ్రీ బి. వేదయ్య గారికి అంకితం ఇవ్వడం సంతోషదాయకం. శ్రీ వేదయ్యగారు శ్రీ గంగప్ప గారికిన్నీ నాకున్నూ ఎంతో ఆత్మీయ మిత్రులు. వేదయ్యగారు గొప్ప నటకుడు. అందులో 'తుఫాన్' నాటికా ప్రదర్శనంలో 'షేమ్' ఆయన వందలాది ప్రదర్శనలిచ్చాడు. అంతకుమించి ఉదాత్తమైన కళారాధకుడు-కళాపోషకుడు. ఆయన సాంస్కృతిక సంస్థల్ని నెలకొల్పి, అనేకమంది కళా కారులను ప్రోత్సహించాడు. అట్టి "కళాభూషణు"నకు ఈ గ్రంథం అంకితం యివ్వడం సార్థకం ! సముచితం! వేదయ్యగారికీ గ్రంథం అంకితమిచ్చి, వారి రువురి మధ్యనున్న స్నేహానుబంధాన్ని పదిలపరచుకొనడం ద్వారా చాలా మంచిపని చేసినందులకు గంగప్పగార్ని అభినందిస్తున్నాను.

ఆచార్య వృత్తి నుండి ఇటీవలననే పదవీవిరమణచేసిన విశ్రాంతా చార్యులు శ్రీ గంగప్పగారు, సమాజ శ్రేయస్సునకు, దేశాభ్యుదయానికి, మానవకల్యాణానికి ఉపయోగపడే నాటికలు, నాటకాలు తదితర సృజనాత్మక రచనలు మరిన్ని వెలయించగలందులకు ఆయనకు ఆయురారోగ్య సుఖ శాంతులు, శక్తిసామర్థ్యాలుప్రసాదించవలెనని భగవంతుని వేడుకొంటున్నాను.

తథాస్తు! స్వస్తి !

అమూల్యశ్రీ

# తె ర తీ సే ముం దు

డాక్టర్ కందిమళ్ళ సాంబశివరావు
లెక్చరర్
DRNSCVS కళాశాల , చిలకలూరిపేట

"విభిన్నరుచులు కలిగిన జనావళికి ఏకత్ర సమారాధన చేసేది నాటకం" అంటాడు కాళిదాసు. జాతిని జాగృతం చేసేది జాతిజీవనాన్ని ప్రతి బింబించేది నాటకం అంటాడు ఆధునికుడు. కాలం మారేకొద్దీ సాహిత్య ప్రక్రియల ఉద్దేశంలోనూ, ప్రయోజనంలోనూ మార్పు కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. కాలం అనేది కదిలే చక్రం.... కాలగమనంలో చరిత్ర అనే శకటం విమ్నోన్నతాలలో కదులుతుంది ... వర్తమానంలో జరిగే సంఘర్ష ణలు.... దోపిడీ హైరార్కీ మూఢవిశ్వాసాల వికటాట్టహాసాలు.... ఒకటే మిటి ఎన్నో అంశాలు కర్ణకఠోరశబ్దంతో మార్చ్‌ఫాస్ట్ చేస్తే సమాజం భయంతో కంపించిపోతుంది ఈస్థితినుండి ప్రజను రక్షించడానికి కవి ఒక దివిటీలా నిలుస్తాడు.... అతని కలం చీకటిని చీల్చే ఓ ప్రత్యూష మౌతుంది. అతడు ఎంచుకొన్నది కావ్యంకావచ్చు . కథకావచ్చు.... నవలకావచ్చు.... నాటకంకావచ్చు ప్రక్రియ ఏదైనా దాని ప్రభావం మాత్రం అసాధారణం.... అయితే మిగతాప్రక్రియలకన్నా నాటకం పదునై నది ... పరమోత్కృష్టమైనది. అందుకే నాటకానికి అగ్రతాంబూలం ఇచ్చారు....

నాటకం యొక్క ప్రయోజనం వినోదమా ? సందేశమా ? ఈ ఆలో చన రెండుదారులుగా చీలింది.... దృశ్యకావ్యం ప్రయోజనం సందేశం అయితే పదిపైసలు పోష్టుకార్డ్‌పై ఆ సందేశం వ్రాస్తే సరిపోతుందికదా అని

ప్రముఖ కథారచయిత; సినీనిర్మాత ఉవాచ. నిజమే కష్టించి పనిచేసినవాడికి సందేశంపట్టదు ... వినోదమే వాడికి ఇంటాక్సికేషన్ ఇస్తుంది.... మరి ఓ సినిమాచూడడంద్వారానో.... ఓనాటకం చూడడం ద్వారానో వాడికి కలిగే ఆనందం శాశ్వతంగా నిలుస్తుందా ? ప్చ్ ... మరి వాడిజీవితాన్ని నాటకంలో చూసుకొంటే ... అందులోని సందేశం అతడి మస్తిష్కానికి పట్టొచ్చు.... ఆనాటకంలోని పరిష్కారం అతడి జీవితానికో దిక్సూచికావచ్చు. కనుక సందేశం కావ్యప్రక్రియకైనా జీవనాడి ... ఆసందేశానికి చిటికెడు విషాదం.... గుప్పెడు వినోదం.... చారెడు నవ్వులతోకలిపి రంగరిస్తే ఉభయతారకంగా ఉంటుంది.... అదిగో.... ఆ ప్రయత్నంతో వచ్చిన నాటికల సంపుటే "దేశం బాగుపడాలంటే".

మాగురువుగారు ... సవ్యసాచి కథలు వ్రాశారు నవలవ్రాశారు.... గేయం వ్రాశారు . పద్యం వ్రాశారు వందలాది వ్యాసాలు వ్రాశారు. యాభైకిపైగా విమర్శన గ్రంథాలు వ్రాసారు . మాస్టారుగారికి నాటకం అంటే మొదటి నుండి వల్లమాలిన అభిమానం అందుకే నాటకంపైనే వ్యాసరచనకు శ్రీకారంచుట్టారు .. పరిశోధనాంశం నాటకమే ... వారికి సాహితీ ప్రపంచంలో చోటు కల్పించిందికూడా మొదటగా నాటకమే.

ఈ సంపుటిలోని క్రాంతి, చిగురించినమోడు, ఉపాయం, పునర్యావనం, ప్రగతి ... లీల.... తిరస్కృత.... దేశం బాగుపడాలంటే వంటి నాటికలు రకరకాలరుచుల సమ్మేళనం ... ప్రతినాటికలోనూ ఒక తపన.... ఒకఆర్తి.... ఒక ఆర్ద్రత.... ఒక సంస్కరణ ... కదంతొక్కాయి. ముఖ్యంగా క్రాంతి ... దేశం బాగుపడాలంటే.... నాటికల్లో సందేశం ... నాటికను డ్రైవ్‌చేసిన పద్ధతి గొప్పగా ఉన్నాయి. దేశాన్నిపట్టి పీడిస్తున్న జబ్బు డబ్బు సంపాదన.... అది ఎలా సంపాదించాం అన్నది ముఖ్యంకాదు .. ఎంత సంపాదించాం అన్నది ముఖ్యం అవినీతి, లంచగొండితనం వికృత వికటాట్టహాసాలతో ... అవక్ర విక్రమ త్రివిక్రమంగా ఎదిగి కదంతొక్కుతూ ఉంటే నీతి; నిజాయితీ

బిక్కచచ్చి ఉక్కిరిబిక్కిరై పోతుంది.... ఆస్థితిలో రామారావులాంటి నిజాయితీపరులు కుళ్ళిన వ్యవస్థకు తన నీతి నిజాయితీలతో కొత్తరక్తం ఎక్కిస్తారు ... ఈ సందేశంతో వ్రాసిన నాటిక దేశం బాగుపడాలంటే....

అధికజనాభా దేశానికి అనర్థదాయకం.... "అపరేషన్‌చేయిస్తే.... అమ్మో.... ఆదేవుడికి కోపంరాదూ...." "ఆడపిల్లా.... మళ్ళా మగపల్లవాడి కోసం చూద్దాం...." "నారుపోసినవాడు నీరుపోయడా?" ఇలాంటి మనస్తత్వాల మూలంగా నియంత్రణనీరుగారిపోతుంది పుట్టేదిమగబిడ్డైనా ఆడబిడ్డైనా.... వారిని ఉత్తములుగా తీర్చిదిద్దాలి....అనే ఆలోచన ప్రతిమనిషి మనసులోనూ రావాలి.... అదే క్రాంతి ... విశ్వమానవాళికి శాంతి...." గంపెడైనా గుడ్డి గులాబీలు.... ఇంపైగ ఇంతైన లేవు సురభిళాలు.... రెండు మంచి గులాబీలు మిన్న–పదిరెండువేల గుడ్డిగులాబీలకన్నా" అనే సందేశంతో వ్రాసిన నాటిక క్రాంతి. ఈ నాటికలో ఎపిక్ నాటక ధోరణికన్పిస్తుంది. రచయిత తాను తీసుకొన్న అంశాన్ని బలంగా చెప్పడం కోసం ప్రసిద్ధమైన పౌరాణిక కథను వివరించి ... తరువాత వాస్తవికంగా ఉన్న సమకాలీన స్థితిని వివరిస్తాడు. క్రాంతి నాటికలో అధిక జనాభావల్ల అష్టకష్టాలనుభవించిన కుచేలుని కథను తరువాత కృష్ణారావు కుటుంబకథను శ్రీ గంగప్పగారు గుదిగుచ్చి వ్రాశారు. ఈ విధానంవల్ల ఇతివృత్తం ప్రేక్షకుడి గుండెల్లోకి బాణంలాగా దూసుకు పోతుంది.

ఇలా చెప్పుకొంటూపోతే ఈ ప్రస్తావనే ఓ ఉద్గ్రంథ మౌతుంది. వ్యాసరచయితగా.... గ్రంథరచయిత లబ్ధ ప్రతిష్ఠులైన మాష్టారు కలం బలం ఏమిటో ఈ నాటికల సంపుటిని చదివితే తెలుస్తుంది ...

చివరిగా నాకు చదువుచెప్పి .. నాజీవితానికి దర్శకులుగా.... నా పరిశోధనకు మార్గదర్శకులుగా.... నాకంటికి నిలువెత్తు వ్యక్తిత్వంతో

కన్పించే మా మాష్టారు .. నానాటికల సంపుటికి నువ్వే ముందుమాట వ్రాయాలి అన్నారు ... ఆయన చెక్కిన శిల్పాన్ని నేను.... ఎంత అదృష్టం .... ఎం.ఏ. డిగ్రీ తీసుకొన్నప్పుడు.... పిహెచ్.డి. పట్టా పొందినప్పుడు– ఒక నాటిక రచయితగా నా నాటకం పదిమంది ప్రశంసలు పొందినప్పుడు కవ్నా .... మాష్టారు పుస్తకానికి ముందుమాట వ్రాయమన్నప్పుడు వ్రాస్తున్నప్పుడు నిజమైన ఆనందం.... కించిత్ గర్వం కలిగింది.

నాటక వృత్తిగా .. ప్రవృత్తిగా కలిగిన చాలామందికన్నా.... తెలుగు నాటకానికి మాష్టారు చేసిన ... చేస్తున్న సేవ .. హేట్సాఫ్.... మాష్టారు ఇంకా మంచి నాటక రచనలు చేయాలని ... వారి అభిమానిగా మనసా.... వాచా , కోరుకొంటూ.... ఏ శిష్యునికీ లభించని అరుదైన అవకాశాన్ని నాకు ప్రసాదించిన అరుదైన అవకాశానికి కృతజ్ఞతాంజలి ఘటిస్తూ....

—డాక్టర్ కందిమళ్ళ సాంబశివరావు



# స్వీకారం

వి. వేదయ్య, B.A., B.L.
రిటైర్డ్ డిప్యూటీ కమీషనర్
వాణిజ్య పన్నుల శాఖ-గుంటూరు

ఆచార్య గంగప్పగారు గుంటూరు నాగార్జున విశ్వవిద్యాలయములో తెలుగు ప్రొఫెసర్ పనిచేసి దక్షత కలిగిన ఆచార్యుడుగానేకాక, సహృదయత కల గొప్పవ్యక్తిగా, కీర్తిప్రతిష్ఠలను, గౌరవాభిమానాలను పుష్కలంగా చూరగొని తేదీ॥ 30-4-1997న పదవీ విరమణ చేశారు. వీరు అతి నిరాడంబరులు, సౌజన్యమూర్తి, కోపమంటే ఎరుగని ఒక మహోన్నత వ్యక్తి, పైగా అభ్యుదయభావాలు కలవారు. భారతీయతను,హిందూధర్మాన్ని, సంస్కృతిని పూర్తిగా ఆకళింపు చేసుకున్న ధన్యజీవి, దేశభక్తుడు. ఇతరులు మనపట్ల ఏమిచేస్తే మనం బాధపడతామో అవి మనం ఇతరులకు చేయకుండుటయే ఉత్తమోత్తమ ధర్మము అన్న విదురనీతిని, మనసా, వాచా, కర్మణా పాటించే పరమపావనుడు శ్రీ గంగప్పగారు.

ఇక సాహిత్యం విషయానికి వస్తే ఆయన సాహితీక్షేత్రంలో నిత్య కృషీవలుడు. పదసాహిత్యాన్ని పోషించి పోసనపట్టిన ఘనాపాటి. నాటకరంగంపై ఎనలేని శ్రద్ధాశక్తులు కలిగిన వ్యక్తి. అసలు డాక్టరేట్ పట్టా పొందినది కూడా శ్రీ కోలాచలం శ్రీనివాసరావు నాటక సాహిత్యంపై చేసిన పరిశోధనా ఫలితమే. తెలుగు నాటక సాహిత్యంపై కూడా అనేక విమర్శనాత్మక రచనలు చేశారు.

వీరు "దేశం బాగుపడాలంటే" అనే పేరుతో ఎనిమిది నాటికలు వ్రాసి ఈ పుస్తంలో పొందుపరచటం జరిగింది. ఇందులో "తిరస్కృత" మహా భారతంలో అంబ భీష్మునిచే తిరస్కరించసడిన ఘట్టం. ఈ నాటికలో

సంభాషణలు సందర్భోచితంగా మృదుమధురంగా, జనరంజకంగా ఉన్నాయి. రెండవ నాటిక "లీల" ప్రేమకథాంశము. మూడవది "దేశం బాగుపడాలంటే" అవినీతి నిర్మూలనాధ్యేయంగా కలది. ఇందులో కథానాయకుడు సేల్స్‌టాక్స్ ఆఫీసర్. అతను నిజాయితీపరుడు. అవినీతి కార్యకలాపాలకు పూర్తిగా వ్యతిరేకి. కొందరు చీకటిబజారు వ్యాపారులు వారి ఆటలు సాగకపోవటంతో వీరిని అక్రమంగా ఒక కేసులో ఇరికించి A. C. B. వారికి పట్టించాలని చూస్తారు. కానీ చివరికి C. I. D. శివం పన్నిన ఉచ్చులోపడి, నిజం బహిర్గతంకాగా, కుట్రదారులు అరెస్టుకాబడతారు. ఈ నాటిక ద్వారా రాష్ట్రానికి అత్యధిక రెవెన్యూను సమకూర్చి పెట్టే సేల్స్‌టాక్స్ డిపార్ట్‌మెంట్‌లో చాలామంది నిజాయితీపరులైన అధికారులున్నారనే వాస్తవాన్ని బహిర్గతపరచటమేకాక, లంచాలు ఇచ్చేవారిని, పుచ్చుకునేవారిని కూడా శిక్షించాలి అనే చక్కటి సందేశాన్ని రచయిత ఇవ్వటం పరిగింది. సేల్స్‌టాక్స్ డిపార్ట్‌మెంటులో ఉన్నత ఉద్యోగులుగా పనిచేసి పదవీవిరమణ చేసిన నాతోను, అమూల్యశ్రీ జె. అమ్మలయ్యగారితోను, రచయితకున్న సుదీర్ఘపరిచయం, స్నేహం బహుశా వీరిని ఈ నాటిక రచనకు ప్రోత్సహించి ఉండవచ్చు. మిగతా నాటికలు అనగా "ప్రగతి" దేశాభ్యుదయాన్నీ, "పునర్యౌవనం" శాస్త్ర పురోగతినీ, "ఉపాయం" దొంగలబారినుండి తెలివిగా తప్పించుకోవడాన్నీ, "చిగురించినమోడు" తుఫానువాతపడిన కుటుంబం పడిన నష్టాలనూ మనకు వివరిస్తాయి. ఇకపోతే చివరినాటిక "క్రాంతి" కుటుంబనియంత్రణ ఆవశ్యకతను, వరకట్న దురాచారాన్ని ఎదిరించాల్సిన తక్షణ కర్తవ్యాన్ని మనకు ప్రబోధిస్తుంది. అన్ని నాటికలను యోగ్యంగాను, ప్రేక్షకులను ఆకట్టుకునే విధంగామలచడంలో ఆచార్య గంగప్పగారు పూర్తిగా కృతకృత్యులయ్యారు. దాదాపుగా ఈ నాటికలన్నీ సమకాలీన సమస్యలను మన కళ్ళకుకట్టినట్లుగా చూపెట్టడమేకాక, రచయిత అభ్యుదయభావాలను వెల్లడిస్తున్నాయి.

ఆచార్య గంగప్పగారితో నా పరిచయం ఈనాటిది కాదు. గత 10 సంవత్సరాలుగా మేము మంచి స్నేహితులము, పైగా సాహితీ మిత్రమండలి

సభ్యులము. గత 5 సంవత్సరాలుగా గుంటూరులోని పై సాహితీ సంస్థకు నేను అధ్యక్షుడిని, ప్రొఫెసర్ గంగప్పగారు ప్రధానకార్యదర్శి, అమూల్యశ్రీ జె. అమ్మలయ్యగారు గౌరవాధ్యక్షులు. ఇప్పటికి మేము పైసంస్థ అధ్వర్యంలో దాదాపు 40పైగానే గుంటూరులో సాహితీ కార్యక్రమాలను నిర్వహించాము. మా ఈ స్నేహాన్ని పురస్కరించుకొని, మాలో ఒకరికిపై ఒకరికి కల ప్రేమాభిమానాలకు గుర్తుగా తన నాటికల సంపుటిని నాకు అంకితమివ్వ దలచి, ఆ విషయాన్ని నాతో చెప్పినప్పుడు, వారి సంకల్పాన్ని నేను మహా భాగ్యంగా భావించి నా అంగీకారాన్ని తెలియచేశాను. హిమాలయాలకంటే ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని, మానవత్వాన్ని, తనదిగా చేసుకొని భాసించుచున్న ఒక అరుదైన వ్యక్తి అయిన ఆచార్య గంగప్పగారు తన నాటికల సంపుటిని నాకు ప్రేమతో అంకితమిచ్చినందుకు వారికి శతసహస్రవందనాలను సమర్పించుకొంటున్నాను.

భవదీయుడు
బి. వేదయ్య
అధ్యక్షుడు
సాహితీ మిత్రమండలి–గుంటూరు

# ప్ర వే శి క

సృజన విమర్శ రెండంచులుగా కొనసాగిన సాహిత్య రచనావ్యాసంగం మూడుపూవులుగా పుష్పించి అరవై వసంతాల వయస్సులో అరవై కాయలుగా ఫలించడం నా అదృష్టంగా భావిస్తున్నాను. ప్రతిభా సంపూజితమైంది. ఈ సృజన. ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసాలలో ప్రతిభ గరీయసి. అలాంటి ప్రతిభ మూలాన్నే సృజనాత్మకశక్తి నన్నూరకుండనీక రచనలెన్నింటినో చేయించింది. నా అవిశ్రాంతాధ్యయనం, బోధన, శోధనలలో విమర్శలెన్నో వెలిశాయి. ఈ విమర్శకు సైతం మూలమయ్యే సృజన విశేషమైంది. నాలోని సృజనాత్మకత మూలాన్నే అనేక కవితలు, కథలు, నాటికానాటకాలు, నవలలు వెలువడ్డాయి. నవోదయం, బాలగేయాలు, అంతరంగతరంగాలు అనే కవితలు, 'తీరినభయం' కథలు, 'పదకవితాపితామహుడు' నాటకం, 'సుహాసినీహాసం, రాజరాజప్రశస్తి, ఆత్మార్పణము' నవలలు, ముద్రణకు నోచుకొన్నాయి. ఎప్పుడో రచింపబడి, కొన్ని నాటకరంగంపై ప్రదర్శితమై మరికొన్ని రేడియోలో ప్రసారితమైన ఈ నాటికలు ప్రస్తుతం 'దేశం బాగుపడాలంటే' అనే పేర వెలుగుచూస్తున్నందుకు సంతోషంగా ఉంది.

'పునర్యౌవనం' మొట్టమొదటి నాటిక. ఇది హైద్రాబాద్ ఆకాశవాణి కేంద్రంనుంచి **6-2-1965**న ప్రసారమైంది. దీనికి'నథానియల్ హథార్న్' రచించిన 'డాక్టర్ హెడీగర్స్ ఎక్స్పెరిమెంట్' అనే కథ ఆధారం. జరామరణాలు ప్రాణిసహజాలు. కానీ ముసలితనంపోయి మళ్ళీ యౌవనం వస్తుందంటే మానవ మనఃప్రవృత్తుల్లో కలిగే పరిణామాల్ని ఇందులో చిత్రించడం జరిగింది. రెండో నాటిక 'తిరస్కృత' హైద్రాబాద్ ఆకాశవాణి కేంద్రం నుంచి **12-4-1996**న ప్రసారమైంది. తిక్కన భారతం ఉద్యోగపర్వం, చతుర్థాశ్వాసంలోని అంబోపాఖ్యానం ప్రారంభంలోని **10, 12** పద్యాలు ఆధారం. అంబకు కలిగిన అన్యాయానికి రసహృదయం ద్రవిస్తుంది. తద్రూప కల్పనమే ఈ నాటిక.

తక్కినవన్నీ సామాజికేతివృత్తాలు గల నాటికలు. **1964**లో 'దేశం బాగుపడాలంటే' నాటిక మాపెనుకొండ హైస్కూల్ వార్షికోత్సవంలో ప్రదర్శ

నార్థం రచితం. అదే సంవత్సరం 'విజయం మనదే' నాటకం రచించారు. అంతకుముందు సంవత్సరం వార్షికోత్సవంలో 'లీల' నాటిక ప్రదర్శించ బడింది. దేశప్రగతిని చాటిచెప్పే నాటిక 'ప్రగతి' 1970లో అనంతపురం ప్రభుత్వ కళాశాల వార్షికోత్సవంలో ప్రదర్శించబడింది. ఆవెనుక దివిసీమలో జరిగిన భయంకర వినాశకరమైన తుఫాన్ వల్ల జరిగిన నష్టాల్ని చిత్రించే నాటిక 'చిగురించినమోడు'. స్త్రీ శిశుసంక్షేమంతోపాటుస్త్రీవ్యక్తిత్వవికాసం ఆశించే నాటకం 'క్రాంతి'. వీటన్నిట ప్రతీకాత్మక, సమస్యాత్మక, దేశభక్తి పూరిత, మానవతాదృక్పథాలు ప్రాధాన్యం వహిస్తాయి; ప్రబోధిస్తాయి.

నేను గుంటూరు నివాసినయ్యాక ఎందరో మహానుభావుల పరిచయ భాగ్యం కలిగింది. వారందరూ నన్నెంతగానో మన్నించి స్నేహభావంతో చూస్తూ ఉండడం నాభాగ్యం. అందునా ప్రసిద్ధ కవిపండితులు,'అమూల్యశ్రీ' జె. అమ్మలయ్యగారి పరిచయంవల్ల శ్రీ బి వేదయ్యగారితో సాన్నిహిత్యం ఏర్పడింది. వారేర్పాటు చేసిన సాహితీ మిత్రమండలికి నన్ను ప్రధానకార్య దర్శిగా నియమించుకొని గౌరవించారు. ఆనాటినుంచి సన్మిత్రులు శ్రీ వేదయ్యగారితో కలిగిన మైత్రి గొప్పదని భావిస్తున్నాను. ఆ స్నేహాన్ని పురస్కరించుకొని నా ఈ నాటికల సంపుటిని వారి దంపతులకు అంకిత మివ్వదలచానని చెప్పగానే అంగీకరించి నన్ను ధన్యుణ్ణి చేశారు. శ్రీ వేదయ్య గారికి, వారి శ్రీమతి అనసూయగారికి నా కృతజ్ఞతలు.

అడిగినదేతడవుగా మాన్య మిత్రులు శ్రీ 'అమూల్యశ్రీ' గారు నా నాటికల సంపుటికి 'నాంది' సంతరించి నన్ననుగ్రహించారు. అలానే నా శిష్యుడు వర్ధిష్ణువు డా॥ కందిమళ్ళ సాంబశివరావు తన నాటకరంగానుభవంతో 'ప్రస్తావన'ను సమకూర్చాడు. వీరిద్దరికి క్రమంగా నానమస్సులు, ఆశీస్సులు.

నా ఈ నాటికలలో కొన్నింటిని ప్రసారం చేసిన ఆకాశవాణి అధికారు లకు, ప్రదర్శించిన మిత్రులకు, చక్కటి ముఖపత్ర చిత్రణ చేసిన శ్రీ దేవీప్రసాద్‌కి, ఈ రచన ఇంత సుందరంగా సిద్ధం కావడానికి సహాక రించిన శ్రీ లక్ష్మీగణపతి ప్రింటర్స్ అధినేతలు శ్రీ బి.వి.యస్. శాస్త్రిగారికి, శ్రీ కోటేశ్వరరావుకు, వారి సిబ్బందికి నా ధన్యవాదాలు !

ఆచార్య ఎస్. గంగప్ప

# అంకితం

సృష్టి చిత్రాతిచిత్రమైంది !
తద్రహస్యమూహాతీతమైంది !

తూర్పు పడమరలు దూరం దూరం
అయినాకలుపుతుంది పరస్పరం !

ఉద్యోగరీత్యా తిరిగాను తెలుగు నాడంతా !
గుత్తిపురిని నిలిచాను శేషజీవితమంతా !

ఎందరో మహనీయుల పరిచయం
వీడనివాడని స్నేహపరిమళమయం !

నాకు నచ్చిన మిత్రులు శ్రీ వేదయ్యగారు
మంచికి, మహోపకారానికి మారుపేరు !

స్వయాన ఉత్తమ కళారాధకులు
విశిష్టకళ, కళాకారుల పోషకులు !
కళామతల్లి నిరంతర సేవాపరులు
'కళాభూషణ' సార్థక బిరుదాంకితులు !

వారికనుకూల ధర్మపత్ని శ్రీమతి అనసూయగారు
అరమరిక నెరుగని ఆనందదాంపత్యం వారిది

అలాంటి ఉత్తమదంపతులకు
ఇస్తున్నా నాటికల సంపుటి అంకితం

మా స్నేహానికి కలకాలం గుర్తుగా ఉండేలా !
తులలేని వెలలేని మణిభూషణంగా వెలిగేలా !

ఆచార్య ఎస్. గంగప్ప

# కృతికర్త దంపతులు



ఆచార్య ఎస్. గంగప్ప, శ్రీమతి పార్వతమ్మ

## స్వీకర్త దంపతులు



శ్రీ బి. వేవయ్య, శ్రీమతి అనసూయ

# తిరస్కృత

పాత్రలు :-

1. అంబ
2. సాళ్వుడు
3. భీష్ముడు
4. సత్యవతి
5. భటుడు

[తెరలో]

సర్వంసహావల్లభా ! సాళ్వరాజరాజా ! బహుపరాక్

సౌంభపురీవల్లభా ! సాళ్వమహారాజా ! బహుపరాక్

శత్రుభయంకరా ! సాళ్వమహారాజా ! బహుపరాక్

మిత్రశివంకరా ! సాళ్వరాజరాజా ! బహుపరాక్

[సాళ్వరాజప్రవేశం]

భటుడు:- ప్రభూ ! ఆసనమలంకరించాలని మీ భృత్యుడు వేడుకొంటున్నాడు. (నిష్క్రమిస్తాడు)

(సాళ్వుడు ఆసనమలంకరించగానే సభలో కరతాళధ్వనులు.)

భటుడు:- (ప్రవేశించి) మహారాజా ! ఒకస్త్రీ ప్రభువుల దర్శనానికై ద్వారంవద్ద వేచి ఉన్నది.

సాళ్వరాజ:- ఏమి! మా దర్శనార్థం ఒక వనిత వేచి ఉన్నదా ? ఆశ్చర్యమే ! మా ఆజ్ఞను పరిపాలించడానికి వెళ్ళిన చారు డారూపం ధరించి వచ్చాడా? లేక మా శత్రుకోటిలోని వాడెవడైన అట్టివేషంలో వచ్చాడా ? కాక నిజంగానే స్త్రీయే వచ్చిందా ? భద్రా ప్రవేశపెట్టు చూద్దాం.

భటు:- చిత్తం. ప్రభువుల ఆజ్ఞ(అనిపోయి వెనుదిరిగి వస్తాడు.)

స్త్రీ:- (నిండు ముసుగులోఉండి) ప్రభుశ్రేష్ఠులకు ఈ దీనురాలు హృదయపూర్వక వందనం ఆచరిస్తూఉంది. ఈ దుఃఖిత దుఃఖం పోగొట్టాలని వేడుకొంటూ ఉంది.

సాళ్వ:- ఓ అజ్ఞాత వనితా ! నీ వెవరవు ? నీకు కలిగిన దుఃఖమేమిటి ?

స్త్రీ:- ప్రభువుల సాంగత్యం లేకుండడమే ఈ దుఃఖానికి కారణం.

సాళ్వ:- ఏమీ మాతో సాంగత్యమా ? ఎంతైన మాటలు.

స్త్రీ:- లేదురాజా! ఓకిక్కలి సహజం.

సాళ్వ:- అదెట్లు ? (కోపంతో) ప్రభువులతో పరాచికాలా ?

స్త్రీ:- కాదు మహారాజా కాదు. హృదయావేదన. వర్షాగమనానికై వేచివుండే చకోరంలాగా నేను ప్రభువులను వెతుకుతూ వచ్చాను.

సాళ్వ:- నీ కభ్యంతరం లేకపోతే అవగుంఠనం తొలగించి మా సంశయ విచ్ఛేదం చేయగలవా ?

స్త్రీ:- ఔను ప్రభూ ! అకదుకేగదా ఈ దీనురాలు ఇంత దూరం రావడం ! తమ పాదదాసిని ! సంపూర్ణ ప్రణయ కంఠధ్వని జ్ఞాపకం లేదాస్వామి !

సాళ్వ:- నిజమే! పరిచిత కంఠమే నీవు అంబవు కాదుగదా ?

స్త్రీ:- ప్రభూ! ఇంకావేని కనుమానం (అంబా ముసుగు తీసివేసి) అవగుంఠనం తొలగించాను. చూడండి స్వామి మీ పాదదాసిని ఔనో కాదో ?

సాళ్వ:- (ఆశ్చర్యంతో) మా అనుమానం నిజమే అయింది. కాశీరాజపుత్రీ! అంబా! పరపురుష పరిగ్రహీతవు నీ రాకకు కారణమేమిటి ?

అంబ:- ప్రభూ ! ప్రణయమున్నచోటికీ పడతి రావడం న్యాయమేగదా?

సాళ్వ:- తుమ్మెద పుష్పాన్ని వెతుక్కుంటూ వెడుతుందిగానీ, పుష్పం తుమ్మెద కోసం రావడం చాలా విరుద్ధం.

అంబ:- పరిస్థితులు తారుమారైన సంగతి ప్రభువులకు విదితమే.

సాళ్వ:- నీ వాఘ్రాణిత పుష్పానివి. మా హృదయంలో చోటులేదు.

అంబ:- పాపం శమించుగాక. ఏపాపమెరుగని దీ దీనురాలు. క్షంతవ్యురాలను ప్రభూ! నిష్కళంక ప్రేమనే మరచితివా స్వామి ?

సాళ్వ:- అనాకనాటి సంగతి.

అంబ:- కాదు ఏనాటికైనా మీ పాదసేవనే కోరుతున్నది. మీ కోసం కష్టనష్టాలను భరించి వచ్చింనే.

సాళ్వ:- ఒకనాడు నిన్నుతప్ప ఇతర స్త్రీలను మేము కన్నెత్తి చూడదలచుకోలేదు. కాని పరపురుషుడు బలత్కారంగా రథారూఢనుగావించి, అపహరించుకొని పోగా వెనుదిరిగి వచ్చిన నిన్నుమేము స్వీకరింపజాలము. అది ధర్మవిరుద్ధం కన్యాత్వం పశించింది.

అంబ:- ఆమాట అనకండిస్వామీ ! నేను వినజాలను.

సాళ్వ:- నీ మాట నిజమే అయితే, బలపరాక్రమ సంపన్నులు, అరివీరభయంకరులు అయిన మాబోటి రాజన్యులందరు స్వయంవరానికి వేంచేసి ఉండగా దుర్వృత్తితో, కండకావరంతో భీష్ముడు నిన్నపహరించి రథంలో కూర్చుండబెట్టుకొని వెళ్లతూంటే మేము చతురంగబల సమేతంగా ఎదిరించగా సమస్త రాజులను పారద్రోలి భీష్ముడు పోయినప్పుడు లేనిప్రేమ ఇప్పుడు కలిగినదా ? ఎవరైనా నవ్విపోతారు ! మేము సహించలేం.

అంబ:- నా ప్రార్థన ఆలకింప వేడుకొంటున్నాను.

అన్నెము పున్నెమున్నెరుగ అంబను, మీ పదదాసి నే ప్రభూ!
తన్నియనౌదు, క్రూరత నకారణ నింది తజేయధర్మమే ?
ఎన్నివిధంబులన్మదిన నెన్నినదోషము లేదొకింతయున్,
మన్ననచేయవేడెదను మాన్యవరా నను ప్రేమమీరగన్.

సాళ్వ:- ఇట్టి ప్రార్థనలకు మా హృదయం కరుగదు. పరగృహీతవైన నిన్ను స్వీకరించడం మా ఆచారంకాదు. పరభుక్తాన్నం అంగీకరించే అవివేకిగూడా ఉంటాడా ?

మన్మనోజలధికి చంద్రముఃకళవని
తలచితి మపుడు ప్రేమతో వెలదినిన్ను,
అట్టి యాశాభవనములు నిట్టె గూలె
నిన్ను స్వీకరింపనిపుడు నీతియగునే?

నీ ముఖం చూపెట్టకు. మేమిక సహించలేం పో.

అంబ:- ప్రభూ ! నాకే పాపమంటదు. భీష్ముడును దోషదూషితుడుకాడు.

సాళ్వ:- ప్రయోజన రహితం పెడలిపో. అనవసరమైనమాట లెందుకు ?

అంబ:- స్వామీ ! దయార్ద్ర చిత్తంతో దీనురాలి పలుకులు వినాలని వేడుకొంటున్నది. తన తమ్ముడు విచిత్రవీర్యునకు వివాహం చేయడానికి నాచెల్లెండ్రతో నన్ను భీష్ముడు తీసుకొని వెళ్ళాడు. మీ యందలి ప్రేమవిన్న భీష్ముడు నన్ను మీ పాలికి పంపించాడు. దయ చూపండిప్రభూ ! ఆ విషయం వింటే మీకే తెలియగలదు. ఆలకించండిరాజా!

భీష్ముడు:- మహారాణీ ! సత్యవతీమాతా ! పుత్రుడు విజేతయై ప్రణమిల్లుతున్నాడు.

సత్య:- వచ్చావా నాయనా ! దేవవ్రతా ! మా యందుగల నీ నిర్మలభక్తి, నిరుపమానమైన నీ అనుజప్రేమ, అనన్యసామాన్యమైన నీ మగటిమి మాకు తెలుసు. ఆయుష్మాన్భవ !

భీష్మ:- అమ్మా ! కాశీరాజపుత్రికలు స్వయంవరాలంకృతలై ఉండగా పరాక్రమ సంపన్నులు భుజగర్వ దుర్వార్థు అయిన రాజన్యులెందరో స్వయంవరానికై వచ్చారు. నేనుపెళ్లి వెంటనే కాశీరాజ పుత్రికలు ముమ్మురిని నారథంలో కూర్చుండబెట్టుకొని హస్తినకు వస్తూండగ రాజులందరు క్రుద్ధులై చతురంగబల సమేతంగా నా మీదికి ఒక్కుమ్మడిగా దండెత్తివచ్చి ముట్టుముట్టారు. నా ప్రచండ కోదండ కళానైపుణ్యం ప్రకటించి శత్రుమూకలు పలాయినమయ్యేట్లుగాచేసి శౌర్యాటోపంతో మీకు కోడండ్రు కాదగిన ముగ్వురు కన్యలను తెచ్చాను మాతా!

సత్య:- చాలా సంతోషం నాయనా ! నీ పరాక్రమం మాకు తెలిసిందేకద. గంగాశంతనుల పుత్రుడవు, పరశురాముని శిష్యుడవు. అస్త్రశస్త్ర ప్రవీణుడవు. నీ కసాధ్య ముంటుందా నాయనా ! ఏరీ ? మా కోడండ్రను చూపించు నాయనా !

(అంబ, అంబిక, అంబాలికల ప్రవేశం)

భీష్ముడు:- తల్లీ ! వీరే అంబ, అంబిక, అంబాలిక- (అంటూండగా అంబిక, అంబాలికలు సత్యవతికి ప్రణమిల్లుతారు. కాని అంబ మాత్రం నిలబడి ఉంటుంది.)

భీష్ముడు:- (కోపంతో) అంబా ఏమిటీవైపరీత్యం ? నీకంటె చిన్నవాళ్ళు అంబిక, అంబాలికలకున్న మర్యాదా నీకు తెలియదా ? మాతల్లి పాదాలకు నమస్కరించు.

అంబ:- ఆర్యా! నాకు మర్యాద తెలియకకాదు.

భీష్ముడు:- మరింకెందుకు ?

అంబ:- నా మనవి ఆలకించిన నీ కోపానికి కారణముండదు.

భీష్మ:- ఏమిటది ?

అంబ:- నా మనస్సెరుగని నీవు నన్ను కొనితెచ్చావు.

భీష్మ:- నీ మనోగతాభిప్రాయ మేమిటి ?

అంబ:- చాలకాలంనుంచి నేను సాళ్వవల్లభులను ప్రగాఢంగా ప్రేమిస్తున్నాను! వారు గూడా నాపై ప్రేమాతిశయంతో ఉన్నారు.

భీష్మ:- ఆసంగతి నేనెరుగనుగదా ?

అంబ:- మీకు తెలియనందువల్ల నే యిట్టిక్లిష్ట పరిస్థితి యేర్పడింది.

భీష్మ:- ఇందులో దోషమేముంది ? నీ తండ్రి కాశీరాజు నీ స్వయంవరం ప్రకటించిన సంగతి తెలిసిననేను నా తమ్మునకు రాణులజేయటానికి మిమ్ములను కొని వచ్చాను.

అంబ:- మా తండ్రిగూడా మా ప్రణయ విషయమెరుంగక స్వయంవరం చాటింపించాడు. అందుకు నానాదేశ రాజాధిరాజు లేతెంచారు. వారిలో నాప్రాణేశ్వరుడు సాళ్వప్రభువులుగూడా ఉన్నారు. వారినే వరింప నేను మధురక్షణానికై వేచి ఉన్నాను. ఇంతలో హఠాత్తుగా నీ యాగమనము, ఆహూత రాజన్యుల పారద్రోలి మమ్మపహరించి తీసుకొని రావడమూ క్షణంలో జరిగి పోయ్యాయి.

భీష్మ:- తెలియక జరిగిపోయింది. చింతించకు.

సత్య:- నాయనా దేవవ్రతా అనుచితం జరిగిపోయింది. (అంబతో) అంబా నీ అభిప్రాయ మేమిటి ?

అంబ:- ఆర్యురాలా నా నిష్కళంక ప్రేమను మన్నించి, సాళ్వవల్లభుల వద్దకు పొయ్యేందుకు అనుగ్రహించాలని వేడుకొంటున్నాను. (భీష్మునితో) ఆర్యా నీవు స్వధర్మ విదుడవు. నీకు వేరుగాచెప్పవనిలేదు.

ప్రేమగల చోటికనుపుట ప్రీతియగును
సర్వధర్మసారవిదుడు శౌర్యధనుడ!
నా మనోనాయకుని జేరనన్ను బంపు
న్యాయమును గూర్చి శీఘ్రమేయవిచార!

సత్య:- నాయనా ! దేవవ్రతా ! అంబ కోరినట్లు చేయడం మనకు శ్రేయస్కరం. (అంబతో) అంబా ! నీవు వెళ్ళి నీ జీవితేశ్వరునితో సుఖంగా జీవించు.

భీష్మ:- అంబా !

"పెంచినాను సాళ్వునకయి ప్రేమలతను"
అన్న నీ మనోగత మిప్డు వ్యక్తమయ్యె,
తెచ్చినాడ బలముమీర తెలియకేను,
పోయి విభునితో సుఖమ్ముల పొంధుమమ్మ !

అంబ :- ఆర్యా! నీవు ధార్మికుడవని నాకు తెలుసు. నాకు అనిర్వచనీయానందం కలిగింది.

సత్య :- దేవవ్రతా! కౌరవవంశమర్యాదకు ఉచితమైన మాటలు చెప్పావు. నాకూ సంతోషమే. నీవు వెంటనే వెళ్ళి వృద్ధాంగనల సాయంతో అంబ ప్రయాణానికి ఏర్పాట్లుచేయి. నేనుకూడ వెళ్ళి ఆయుష్మంతుడు విచిత్రవీర్యునితో అంబిక, అంబాలికల వివాహానికి తగిన సన్నాహాలు గావిస్తాను. (అంబతో, అంబా! సుఖంగా వెళ్ళిరా.

అంబ :- మహారాణీ! నాభాగ్యం.

భీష్మ :- అంబా! ఇటురా, మాతా! మీఆజ్ఞను పాలిస్తాను.

[అందరు నిష్క్రమిస్తారు]

........× ... ... ×........×

అంబ :- ఇప్పటికైనా తెలిసిందా ప్రభూ! నాలోదోషం లేదన్న సంగతి.

సాళ్వ :- అంబా! మేము స్వీకరింపజాలం. లోకం వేలెత్తిచూపుతుంది.

అంబ :- అయితే లోకంకోసం అకలుషహృదయ, ప్రేమ నిర్భరమానస అయిన నన్ను త్యజిస్తారా రాజా!

సాళ్వ :- రాజు ప్రధాన ప్రకృతిః కనుక ఆదర్శమూర్తి కావాలి. లేకపోతే 'యథా రాజా తథాప్రజా' అన్నసూక్తి ప్రకారం ప్రజలు కూడ ప్రవర్తిస్తారు.

అంబ :- తూష్ణీంభావం వహించిత్యజించడమే ఆదర్శమంటారా?

సాళ్వ :- కాదు. సత్సంప్రదాయాన్ని కాలదన్నక దానిని ఉద్ధరించడమే మా అభిమతం.

అంబ :- మరి ఇచ్చినమాట నిలబెట్టుకొనడం మీ అభిమతం కాదా!

సాళ్వ :- ధర్మవిరుద్ధమైనప్పుడు ఇచ్చిన మాటత్యజించడమే ఉచితం.

అంబ :- అయితే మీ ప్రణయమంతా కల్ల అన్నమాట !

సాళ్వ :- అప్పుడది సత్యం. కాని ఇప్పుడు వ్యతిరేకం.

అంబ :- కాని ప్రభూ! మళ్ళీమిమ్ములను అర్థిస్తున్నాను. దీనురాలిని స్వీకరించండి

ప్రభూ! కడకు మీపాదదాసిగానైన బ్రతకనివ్వండి స్వామీ!

సాళ్వ :- అంబ! మేము స్వీకరించలేం. స్వీకరించలేం. పరిపరి విధాల చెప్పిన నీవు గ్రహించవు. మా మానసికాందోళన గుర్తించలేవా?

అంబ :- [కొంత సేపు మౌనంగా ఉండి, అశ్రుధారలు రాలుతూండగా] ప్రభూ ! ముగ్ధనైన నాకు ప్రేమనేర్పి, వేయి వసంతాల సంతోషం నాలో కుప్పబోసి, ఇప్పుడు త్రోసిపుచ్చడం న్యాయమా ?

సాళ్వ :- అంబా! మాకు శతవిధాలా చెప్పపనిలేదు. నీవనర్హ వు.

అంబ :- స్వామీ! నన్ను కామశరపీడితనుజేసి విరహానలదగ్ధను గావించి, తప్పు కోవడం ధర్మం కాదు. నా హృదయవేదన గ్రహించండి.

సాళ్వ :- సాధ్యంకాదు? దుర్వృత్తితో అపహరించిపోయిన వానినే శరణు వేడుకో.

అంబ :- అదెలా సాధ్యం ! సంపూర్ణ ప్రణయానందం రుచిచూపిన వారే త్యజిస్తూండగా, భీష్ముడు తన తమ్మునికి వివాహం చేయడానికంగీకరిస్తాడా!

సాళ్వ :- ఏది ఏమైన మేము గ్రహించడం స్వప్నవార్త ధర్మవిరుద్ధం.

అంబ :- [మౌనం వహించి] మీరు మగవారనిపించుకొన్నారు. బలపరాక్రమా లతో కొనిపోయిన వీరుని వదలివచ్చాను. ప్రేమమూర్తినన్ను మీతో త్యజింపబడ్డాను. ఇట్టి పరిస్థితిలో స్త్రీ జీవితం ఎలా పరిణమిస్తుందో గమనించారా !

సాళ్వ :- నీజీవితం దుఃఖప్రాయమన్న సంగతి మాకు తెలుసు. కాని మేము ఇంత కంటె చేసే దేమీలేదు.

అంబ :- నాబ్రతుకిలా బండలవుతుందని నేను కలలో గూడ తలంచలేదు. హే భగవాన్ ! నేను చేసిన పాపమేమి ? [సభనుద్దేశించి] సభాసదులారా ! పెద్దలారా! మీరైన న్యాయం చెప్పండి.

సాళ్వ :- మా మాటకు తిరుగులేదు నీవు వెళ్ళ వచ్చు.

[సభనిశ్శబ్దం]

అంబ :- ఏమీ! ఇంతేనా! సభమౌనం వహించిది. నాకేదీదిక్కు? [కన్నీటితో] నా జీవితం త్రిశంకుస్వర్గం. రెంటికి జెడిన రేవనిలా అయ్యాను. నా జీవితం దుర్భరం కావడానికి కారణం మీరే [illegible] కాదు. మాతండ్రి. నేను పరాధీన మనస్క అన్న సంగతి తెలియక స్వ[illegible]ం ప్రకటించారు. అందువల్ల మాతండ్రే కారణం. కాదు మాతండ్రి [illegible]మ సంగతి తెలుపకుండడం వల్ల నేనే కారణం. అంతేగాక నేను పూర్వజన్మలో ఏజంటకోఎడబాటు

కల్గించాను కాబోలును. కాని యిదీకాదు. దీనికి హేతుభూతుడు భీష్ముడు. భీష్ముడు హఠాత్తుగా వచ్చి నన్ను పరిగ్రహించిపోకుంటే నా అభిలాష ప్రకారమే మిమ్ము వరించి ఉండేదానను. కాబట్టి దీనికంతటికి నిజమైన కారణం భీష్ముడు. భీష్ముని సాధించితీరుతాను. అబల ఆగ్రహించిన ఏమైన చేయగలదని నిరూపిస్తాను వ్యర్థమైన జీవితాన్ని ఆ విధంగా సఫలంచేసు కొంటాను. ప్రభూ! నా జీవితం నాశనమైంది మీరైన సుఖంగా బ్రతకండి. మీ చేత తిరస్కృతను.

సాళ్వ :- ఔరా! నీ ప్రణయక్షమాగుణం మహత్తరం! నీ ప్రేమ నిర్మలం, అమరం! హృదయ విదారకమైన నీ స్థితిచూస్తూ కూర్చుండలేం. మామనస్సాందోళిత మైంది. కాని స్వీకరించి ధర్మవిరుద్ధం ఆచరించలేము. పోపో మా మందిరం వెడలి. మేమింకనిలువ జాలము. (అంటూ నిష్క్రమిస్తాడు)

అంబ:- [దుఃఖంతో] ప్రభూ ! తిరస్కరించి వెళ్లతున్నారా ? ఔను నేను తిరస్కృతను. ఇట్టి నా దుస్థితికి కారణం భీష్ముడు ఇతడు సత్యవ్రతుడట ! తెలిసిందిలే నీ సత్యవ్రతం. [మౌనం] ఓ భీష్ముడా ! దుర్భరమైన నా పరాభవాగ్ని నుంచి తప్పించుకోలేవు. నీవు గావించిన ఘోరానికి తగిన ఫలం అనుభవించగలవు.

అబలయన బడెడు వనిత అవనియందు
సబల యై నిన్ను సాధించు శపథమూని
తపము ఘోరముగచేసి, దర్పమునను
కదన రంగాన భీష్ముడ ! కాచుకొమ్ము !

ఆహా! జీవితం దుర్భరం. దుస్సహం. హృదయం బ్రద్దలవుతూంది. భరించ లేకున్నాను. కాని భరించడం అవసరం. నా శపథం పరిపూర్తి చేస్తాను. భీష్ముని కారణంగా ప్రేమించిన వాళ్లచే తిరస్కరించపడ్డాను: ఔను నేను తిరస్కృతను [అంటూ నిష్క్రమిస్తుంది]

(ఆకాశవాణి సౌజన్యంతో)



# లీల

పాత్రలు :

1. శ్యామ్‌ప్రసాద్
2. లీల
3. సాంబమూర్తి
4. రాఘవులు

## రంగం - 1

[పెద్ద హాలు, —హాల్లో గోడలకు నానారకాల చిత్రాలు వ్రేలాడదీయబడి ఉంటాయి— ఒక పెద్ద బీరువా, ప్రక్కనే చిత్రకారుడికి కావలసిన సరంజామా అంతా హాల్లో కుడిప్రక్క ఉంటుంది. ఒక స్త్రీమూర్తి సగం చిత్రింపబడిఉంటుంది. మధ్యన ఒకబల్ల, చుట్టు నాలుగైదు కుర్చీలు ఉంటాయి— బల్లమీద 'టైమ్‌పీస్' ఉంటుంది— ఎడమప్రక్క ఇంకో గదిలోకి ద్వారముంటుంది— ఆ ప్రక్కనే 'టాయ్‌లెట్ రూమ్' ఉంటుంది— ఉదయం 9 గంటల సమయం.]

శ్యామ్‌ప్రసాద్ : [పాతికేళ్ల వయస్సు - భగ్నహృదయునిలాగా తలసంస్కార రహితంగా ఉంటుంది. స్త్రీమూర్తిని చిత్రిస్తూంటాడు - మధ్యమధ్య పిచ్చిగా పాటలుగూడ పాడుతూంటాడు.]

"చిత్రమే ఆడునటే - చిత్రమే పాడునటే...."

ప్రేయసీ! నాప్రేమనే శంకిస్తున్నావా? నానిష్కలంక ప్రేమను తిరస్కరిస్తావా? నాప్రేమకు తార్కాణం ఈ నీ చిత్రమే. అన్ని ప్రేమలేఖలువ్రాస్తే ఒక్కదానికైనా బదులువ్రాసిన పాపానబోయావా? నా హృదయమే కావా అంతా నీపాదాలకర్పణ చేసుకొందునుగదా? నీ కనునవ్వులలో స్వర్గాన్ని చూచేభాగ్యం నాకులేదా? నాకు ప్రపంచమంతా లీలామయమే. లీలా! లీలా! అని పరితపించి మరణించాల్సిందేనా! నాకు వేరు శరణ్యంలేదా?

[అంటూండగా సాంబమూర్తి ప్రవేశం - శ్యామ్‌కంటె రెండేళ్ళు చిన్న-బాల్యంనుంచి గూడ ఆప్తమిత్రులు.]

సాంబమూర్తి : [ప్రవేశించి]- ఉంది. ఎందుకులేదూ?

శ్యామ్ : [ఆశ్చర్యంతో] ఆఁ! వచ్చావా ప్రేయసీ!

సాంబ : ప్రేయసిగాదు ప్రియమిత్రుడు.

శ్యామ్ : [చిత్రం ముందునుంచే హాలుమధ్యకి వచ్చి] అరె! ఎపుడొచ్చావ్ మూర్తీ! వస్తున్నట్టు ఉత్తరమైనా రాయలేదే? ఇటుకూచోవోయ్! [ఇద్దరూ కుర్చీలలో కూర్చుంటారు]

సాంబ : నిన్న సాయంత్రమే వచ్చాను. అన్నట్టు నీ ఆరోగ్యం ఎలా ఉంది? ఏమిటి ఇలా తయారయ్యావ్?

శ్యామ్ : ఏమని చెప్పాలోయ్! [ఎడమపైపు తిరిగి] రాఘవులూ! రాఘవులూ! [రాఘవులు, బంత్రోతు - ప్రవేశిస్తాడు]

రాఘవులు : [40 ఏళ్ల వయస్సు - దుబ్బుమీసాయి - కాకీడ్రెస్సును] ఏం బాబు గోరూ?

శ్యామ్ : మంచి కాఫీ పట్రా

రాఘ : అలాగే బాబుగోరూ [వెళ్ళిపోతాడు)

సాంబ : బొస్లే! భగ్నహృదయులు ఇలాగే తయారౌతారు.

శ్యామ్ : లీలను ప్రేమించాను.... కానీ.... కా.... నీ,... [అంటూండగా రాఘవులు ఇద్దరికి కాఫీ ఇస్తాడు. కాఫీ రుచిచూస్తూ]

సాంబ : బ్రదర్! అవన్నీ నాకు తెలుసు. ఫలించని ప్రేమకోసం ప్రాకులాడ గూడదు. ఆ చాప్టర్ అక్కడ క్లోజ్‌చెయ్. ఈ ఊళ్లో చక్కని చుక్కలు అందాలభామలు ఎంతమంది లేరు. ఇంకెవరినైనా సెలెక్టుచేసుకో.

శ్యామ్ : మూర్తీ! నీవేనా మాట్లాడుతూంది? దుర్భరం. ఒరే మూర్తీ! నీవైనా దీనిన్ని చక్కబెతుదు?

సాంబ : అప్పే అవేంకుదరవు!

శ్యామ్ : ఏఁ ఎందుకని?

సాంబ : లీలానాయుడని లీలకు దూరపుబంధు వొక యువకుడున్నాడు. వాళ్లిద్దరికి ముహూర్తం నిశ్చయం చేశారు.

శ్యామ్ : ఆఁ! నిజమేనా? హతోస్మి! [మూర్ఛపోయినట్లు తూలిపడిపోతాడు]

సాంబ : అరే! శ్యామ్? [అని పట్టుకొని మొహంమీద చన్నీళ్లు చల్లుతాడు]

శ్యామ్ : [తెప్పరిల్లి] లీలా! నిన్ను చిత్రవధచేసినా నాకోపం చల్లారదు. నాకసి తీరదు. నాహృదయఫలకం మీద చిత్రించుకొన్న నీచిత్రాన్నే ఈ కాగితంమీద నాశక్తి ధారవోసి చిత్రించాను. నీవు లేనప్పుడు దీనివల్ల ప్రయోజనమేమి? ఛీ! ఛీ! [అని లేచిపోయి సగం చిత్రింపబడిన స్త్రీమూర్తి చిత్రాన్ని పరపరా చించివేస్తాడు]

సాంబ : అరే ఏమిటీ అఘాయిత్యం!

శ్యామ్ : ఛీ! దుర్మార్గురాలా నీకోసం నేను రేయింబగళ్లు ఎంత జపించిపోయానో నీకేంతెలుసు? ఛీ! ఛీ! పేరు తలచుకోడమే మహాపాపం. అవును లే. నిన్ను నీ ప్రయోజనమేముంది. నాబుద్ధి గడ్డితినింది [అని యోచిస్తూంటాడు]

సాంబ : [చిరునవ్వుతో] ఏమిటో భగ్నహృదయులు ఆలోచనలో పడ్డారు?

శ్యామ్ : ఔను. ఎలుకకు ప్రాణసంకటం పిల్లికి చెలగాటం. నీకు నవ్వులాటగానే ఉంటుంది. 'లవ్' అంటే అర్థం తెలీనివాడికి నీకేం అర్థమౌతుందోయ్ నా బాధ? 'ఛా' బ్రతికి ప్రయోజనమేమి?

సాంబ : అరే బ్రదర్! చచ్చి సాధించేముంది? ఫీటిని తేలిగ్గా తీసుకోవాలి. పరిసర వాతావరణాన్ని నిందించి ప్రయోజనం శూన్యం. విషయాన్ని గ్రహించే విధానంలో ఉంది మజా! నీవు దుఃఖిస్తే పరిసర వాతావరణం దుఃఖిస్తుంది. నీవు నవ్వితే నవ్వుతుంది. కాబట్టి నీకు చేతనైతే ఇంకో అమ్మాయిని ప్రేమించు నీ జీవితం స్వర్గతుల్యం చేసుకో.

శ్యామ్ : అది ఎంతమాత్రం కుదరదు. నా హృదయాన్ని ఒక్కరికే ఇవ్వగలను. ఇచ్చాను. ఇక చావను. బ్రతికే సాధిస్తాను. [అని యోచిస్తూంటాడు]

సాంబ : నీ ప్రయత్నం నిష్ఫలం. అప్పుడే తాంబూలాలుగూడ పుచ్చుకొన్నారు.

శ్యామ్ : [లేనినగవు తెచ్చిపెట్టుకొని] సరే! కాని ఏం చేస్తాం? [తమాయించుకొని] అన్నట్టు అబ్బాయి ఎలా ఉంటాడు?

పాంబ : అబ్బాయికేం నిక్షేపంలా ఉంటాడు. అందంగాకూడ ఉంటాడు.

శ్యామ్ : లీలానాయుణ్ణి మనం చూడొచ్చా?

పాంబ : ఓ తప్పకుండా!

శ్యామ్ : మరి ఎప్పుడు?

పాంబ : కావాలంటే ఇప్పుడే వెళ్లదాం!

శ్యామ్ : ఛీ! ఛీ! లీల ఇంటికే! అతనినే ఇక్కడకు వచ్చేట్టు చూద్దూ? నీకు పుణ్యముంటుంది!

పాంబ : సరే! అలాగే!

శ్యామ్ : సాయంత్రం ఆరుగంటలకు రెడీగా ఉంటాను. నవవరునకు తగిన సన్మానం చేద్దాం. తప్పకుండా తీసుకొస్తావుగదూ?

పాంబ : తప్పకుండా! సరే నేవెళ్తా!

శ్యామ్ : మంచిది. [పాంబమూర్తి వెళ్ళిపోతాడు] రాఘవులూ! రాఘవులూ! పగలు కూడ కునికిపాట్లేమిట్రా?

రాఘ : [కన్నులు పులుముకుంటూవచ్చి] పిల్చారా బాబుగోరూ!

శ్యామ్ : ఔను. ఆ బీరువాలో మాంచి కత్తొకటుందిగదూ?

రాఘ : [ఆశ్చర్యంతో] కత్తి! దేనికి బాబుగోరూ!

శ్యామ్ : అహాఁ! ఉందీగదా అని!

రాఘ : ఉంది బాబుగోరూ.

శ్యామ్ : ఇక్కడపట్రా.

రాఘ : [కత్తితో ప్రవేశిస్తాడు]

శ్యామ్ : ఈరోజు సాయంత్రం ఆరున్నరతరువాత నీవొక ఘనకార్యం చేయాల్సి ఉంటుంది.

రాఘ : ఏంది బాబుగోరూ మీరనేది? నేనా! ఘనకార్యమా?

శ్యామ్ : ఔను లీల నీకు తెలుసుగా?

రాఘ : లీలమ్మగారు తెలీకేమీ?

శ్యామ్ : లీలానాయుడనే యువకునితో పెళ్లి నిశ్చయించారట.

రాఘ : [సంతోషంతో] మాబాగుంది బాబుగోరూ!

శ్యామ్ : [కోపంతో] ఛా! అదిగాదోయ్? వెధవబుర్ర నీవూనూ!

రాఘ : ఇంకేదిబాబూ?

శ్యామ్ : నేను లీలను ప్రేమించానని నీకు తెలుసుగదూ?

రాఘ : [ఔనన్నట్లు తలాడిస్తాడు]

శ్యామ్; ఆ అమ్మాయికి ఏ గన్నయ్యతోనో పెళ్ళవుతూంటే నేను ఎలా సహించ గలను.

రాఘ : అందుకని?

శ్యామ్ : నీవు చిన్నసహాయం చేయాలి సాయంత్రం ఆరుగంటల తరువాత సాంబ మూర్తితోసహా లీలానాయుడు వస్తాడు. కొంత సంభాషణల తరువాత సాంబ మూర్తిని బయటికిపెళ్లే ఏర్పాటు నేచేస్తాను. అప్పటికి నీవు కత్తితో రెడీగా ఉండాలి.

రాఘ : బాబోయ్! పెళ్ళికుమారుని చంపమంటారా? వెయ్యి అబద్ధాలాడైనా ఓపెళ్ళి చేయమన్నారుగాని, అంతఘోరం నాచేతగాదు. నేను చేయలేను.

శ్యామ్ ; కాదులేవయ్యా! ఈ కత్తి ఝుళిపించి భయపెట్టు. లీలను పెళ్లాడనని వాగ్దానం చేస్తేసరి. లేకపోతే ఒళ్లు హూనంచెయ్యి. అప్పటికి.... [కోపంతో].... దారికి రాకపోతే.... [తమాయించుకొని] తరువాత చూద్దాం.

రాఘ ; కావాలంటే కత్తి ఝుళిపిస్తానుగాని చెయ్యిమాత్రం చేసుకోను బాబుగోరూ! నాకు నలుగురు సంతానం.

శ్యామ్ : నీప్రయత్నం చెయ్యి. దారికి రావటమే ముఖ్యం. మొదట నయానచెప్పు తరువాత భయాన. సాయంత్రం పార్టీకి కావలసిన ఏర్పాట్లు చెయ్యి. ఆరు గంటలకంతా తయారుగా ఉండాలి. నే సలాబజారు పెళ్ళివస్తాను [పెళ్ళి పోతాడు]

రాఘ : సరే బాబుగోరూ! ఇదంతా నాఖర్మ. అప్పుడే వన్నెండు కావస్తాఉంది. మిగతా పన్లు చాలా ఉన్నాయి [అని లోనికి పోతూండగ]

—: తెర —:

# రంగం - 2

[అదేహాలు - హాలంతా పరిశుభ్రంగా ఉంటుంది. పార్టీకి కావలసిన ఏర్పాట్లన్నీ జరిగిఉంటాయి - సుమారు అరున్నర గంటలు సూచిస్తోంటుంది గడియారం]

శ్యామ్ : [హడావిడిగా ప్రవేశించి] రాఘవులూ! రాఘవులూ!

రాఘ : పిల్చారా బాబుగోరూ?

శ్యామ్ : అంతా తయారైనట్టేనా?

రాఘ : తయ్యారు బాబుగోరూ.

శ్యామ్ : నేనే ఆలస్యంగా వచ్చాననుకొన్నాను. కాని సాంబమూర్తి ఇంతవరకూ రాలేదే! కారణమేమై ఉంటుందో? [హాల్లో పచార్లుచేస్తూ] రాఘవులూ! కాని ఇంకా ఒకగంటసేపు ఓపికపట్టి చూద్దాం - వాళ్ళు వచ్చిన తరువాత నీవు తొందరగా తయారుగావాలి. నీడ్రెస్సు నీవు అంతా అప్పుడే చెప్పానుగా!

రాఘ : అలాగే బాబుగోరూ! [అని లోనికి పోతాడు]

శ్యామ్ : [పచార్లుచేస్తూ] లీలా! మన ప్రేమలత చిగిర్చి, మొగ్గతొడిగి పుష్పించి, ఫలిస్తుందిగదా అని ఎన్నో తియ్యని పగటికలలుగన్నాను. కలలన్నీ కల్లలైపోయాయి. మన ప్రేమరాజ్యానికి రాణివౌతావనుకొన్నాను. "క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్" అన్నాడు ఒక ప్రాచీన గొప్ప ప్రబంధకవి. నీపేరే తలచుకోగూడదు. [ఎడమవైపు గదిలో చిన్నశబ్దం విని ఉలిక్కిపడి బయటికివెళ్ళి చూచివస్తాడు.] అరే! ఏమీలేదే? ఊరికేనే భ్రమపడుతున్నాను. [చిరునవ్వుతో] పాపం! లీలానాయుడెవరోగాని చాల అమాయకుడు. ఐపిటీ యూపూర్ క్రీచర్! మనప్లాన్ విజయమైతే ఇహచూసుకో మన తడాఖా! [కోపోద్రిక్తుడై] నానిష్కల్మష ప్రేమను తిరస్కరిస్తావా? శంకిస్తావా? కోన్‌కిస్కా [అటూ ఇటూ తిరిగి గడియారంచూచి] అరే! అప్పుడే ఏడుగంటలయింది. ఇంకా రాలేదే [అని బిక్కమొగం వేసి కుర్చీలో కూలబడతాడు— అంతలో తలుపుతట్టిన శబ్దం - కంగారుగా లేచి] వస్తున్నా! వస్తున్నా! [అని ఎడమవైపు వెళ్ళి మెల్లగా రాఘవులకు హెచ్చరిక ఇచ్చివచ్చి తలుపు తీస్తాడు.]

[సాంబమూర్తి, అతనితోపాటు లీలానాయుడు ప్రవేశిస్తారు— లీలానాయుడు దాదాపు సాంబమూర్తికి సమవయస్కుడు - తలవర్ కట్ నూనూగుమీసాలు - ఫుల్ సూటు ఈవినింగ్ హేట్ ధరించి ఉంటాడు.]

శ్యామ్ : గుడ్ మార్నింగ్!

లీలానాయుడు : [సాంబమూర్తితో వస్తూ] వెరీగుడ్ మార్నింగ్

శ్యామ్ : దయచేయండి [కుర్చీలు చూపిస్తాడు]

సాంబ : ఒరేశ్యామ్! వీరే మిష్టర్ లీలానాయుడు. [లీలానాయుడితో] వీడే నా ఫ్రెండ్ శ్యామ్ప్రసాద్ అని చెప్పానుగా?

శ్యామ్ }
లీలా } గ్లాడ్ టుమీట్ యూ! [అని ఇద్దరు కరచాలనం చేస్తారు ఇద్దరూ అదో రకంగా ఫీలవుతారు. శ్యామ్కి ఆ వ్యక్తి పరిచయస్తునివలె తోస్తాడు.]

శ్యామ్ : [ఫలహారాలు వారి ముందుంచి] ఇక కానివ్వండి.

సాంబ : అబ్బే ఇవన్నీ దేనికి? వస్తూవస్తూ ఫుల్ డోస్ కొట్టేశాం.

శ్యామ్ : నీవు సరేలేవోయ్. నవవరునకు తగిన సన్మానంచేయాలిగా!
[అందరూ ఫలహారం, కాఫీలు పూర్తిచేస్తూండగా]

శ్యామ్ : అరే! అన్నట్టు మరచాను. ఈ హడావిడిలో నన్ను నేనే మరచిపోయాను.

సాంబ : అబ్బబ్బ! ప్రాణంతీయక ఆ మరిచిందేదో తొందరగా ఏడవరా?

శ్యామ్ : మీరు వచ్చేముందే నీకోసం మీబంట్రోతు వచ్చాడు. నీవిక్కడుంటే తొందరగా ఇంటికి తీసుకపోవడానికి. నీవు వచ్చినవెంటనే పంపుతానని చెప్పాను.

సాంబ : ఎవరుపిలిచింది?

శ్యామ్ : మీనాన్నగారట.

సాంబ : ఏమైఉంటుంది చెప్మా?

శ్యామ్ : ఏమో అర్జెంటువనేమో?

సాంబ : వెళ్ళక తప్పదా?

శ్యామ్ : నీయిష్టం. నాబాధ్యత తీరిపోయింది.

సాంబ : సరే! [లీలానాయుడితో] మీరు శ్యామ్‌తో మాటాడుతూండండి. తొందరగా వస్తాను. [అని గబగబా వెళ్ళిపోతాడు]

శ్యామ్ : మీరేమాత్రం చదువుకొన్నారు?

లీలా : అబ్బే! బి.ఏ. మాత్రమేనండి [అని ముక్తసరిగా జవాబు.]

శ్యామ్ : అహా! అలాగా! [అని లేచిపోయి] రాఘవులూ రెడీయేనా?

రాఘ : [లోపల్నుంచియే] ఔను బాబుగోరూ!

లీలా : ఎందుకండి రెడీ?

శ్యామ్ : అబ్బే ఏమీలేదు. ఒక్కరినే విడిచివెళ్ళుతున్నానే అని చింతిస్తున్నాను. అయినా మా రాఘవులు వస్తాడులెండి నేను తొందరగానే వస్తా. [ఎడమ వైపు గదిలోకి పోతాడు]

లీలా : [అయోమయంగా చూస్తూండగా]

[ఎడమవైపు గదిలోనుంచి నల్ల పేంటు, షర్టూ, వేసుకొని తెల్లని తలపాగా చుట్టుకొని, దుబ్బుమీసాల వ్యక్తి వస్తాడు. వస్తూవస్తూనే తలుపు మూస్తాడు. ఎడమ వైపు తలుపు శ్యామ్ అటువేపునుంచి మూస్తాడు.]

లీలా : [హడలెత్తిపోయి] ఎవరు నువ్వు? ఏమిటి అన్యాయం? ఎందుకు తలుపులు మూస్తున్నావ్? [అటుఇటూ చూస్తూ] ఏమండీ శ్యామ్‌ప్రసాద్‌గారూ? ఎక్కడండి?

వ్యక్తి : ఇదిగో నీవెంత అరచినా ప్రయోజనంలేదు. నేనెవడైతే ఏంగాని నాకు సూటిగా సమాధానం చెప్పు.

లీలా : [భయంతో వణకిపోతూ అలాగే అన్నట్లు తలూపుతాడు]

వ్యక్తి : లీలను పెళ్ళిచేసుకోవడం నిజమేనా?

లీలా : [తమాయించుకొని] అనే అనుకొన్నాను.

వ్యక్తి : అవన్నీ కట్టిపెట్టి నేను చెప్పినట్లు వినాలి.

లీలా : ఏమిటది?

వ్యక్తి : లీలను పెళ్ళిచేసుకోనని వాగ్దానంచెయ్యి. ఇప్పటినుండి లీలను మరచిపోవాలి.

లీలా : అమ్మో! అది నావశంకాదు.

వ్యక్తి : మనసు మార్చుకోలేవా?

లీలా : అసాధ్యం. అసంభవం. నూరు అడ్డైనా ఆరునూరైనా లీలను పెళ్లాడి తీరు తాను. మీరంతా నాటకమాడుతున్నట్టుందే?

వ్యక్తి : ఆ [హాఁ హాఁ] ఇది మహానాటకం. చెప్పు మానుకొంటావా లేదా? [అని పేంటుజేబులోంచి కత్తితీసి ఝుళిపిస్తాను.]

లీలా : [కత్తిచూచి వణకిపోతాడు]

వ్యక్తి : నాయుడుగారూ! మర్యాదగా వాగ్దానం చెయ్యండి. లేకపోతే ఈ కత్తికి ఎరగావల్సి వస్తుంది. జాగ్రత్త! [అని కత్తితో పొడిచేవానిలా ప్రక్కనుంచి మీదిమీదికి పోతాడు]

లీలా : [వణకిపోతూండగా "ఈవినింగ్‌హాట్" క్రింద పడిపోతుంది]

వ్యక్తి : [స్తబ్ధుడై] ఎవరునువ్వు? ఏమిటీ వేషం?

లీలా : [ధైర్యంగా నిలబడి] అంతేగాదు. [అని మీసాలు ఊడదీసి జడకూడ సరి చేసుకొంటుంది]

వ్యక్తి : [ఆశ్చర్యంతో] ఎవరు లీలమ్మగారే! [అని తలపాగా తీస్తాడు]

లీలా : నువ్వేనా రాఘవులూ? ఏమిటి నాటకం?

[ఎడమవైపు తలుపువెనుక నక్కిఉన్న శ్యామ్ ఈ సంభాషణ విని తలుపు తెరచుకొనివస్తూ]

శ్యామ్ : ఆఁ ఏమిటీ? నువ్వు నా లీలేనా? నాకళ్ళను నేనే నమ్మలేకపోతున్నాను.

రాఘు : సిగ్గుతో లోనికిపోతాడు]

లీలా ; ఆఁ నేనే! ఇంటికివచ్చిన వాయిువాళ్ళను కత్తితో పొడవమన్నాను.

శ్యామ్ : [సిగ్గుతో] అవేమీకాదు లీలా! నిన్ను ఎవడో పెళ్లాడుతూండే నాప్రేమ ఏమైపోను? భరించను? చంపనున్నానా? ఊరికే భయపెట్టమన్నాను. అంతే మేమేదో నాటకమాడుతున్నామని అనుకొంటే మీరు మహానాటకమాడారే?

[తలుపుతట్టిన శబ్దం] రాఘవులూ! ఎవరో చూడు. [రాఘవులువచ్చి తలుపు తీసి లోనికిపోతాడు. సాంబమూర్తి అమ్మాగా ప్రవేశిస్తాడు]

లీలా : [సిగ్గుతో] ఏమో! సాంబమూర్తి నడగండి.

సాంబ : అరే ఏమిటిదంతా? లీలానాయుడు లీలాదేవిగా మారింపే? అంత వింతగా ఉంది.

శ్యాము:- వింతగానే ఉంటుందిలే. నన్నెంత మభ్యపెట్టావోయ్ ?

సాంబ:- నీవు ఆడిననాటకమేమిటో మొదటచెప్పు. ఇంట్రోతు రాసూలేదట. నాన్న కబురంపనూలేదట. అంతా ఇది నీ నాటకం.

లీలా:- నిమ్మలను ఇంటికిపంపి వారు లోనికిపోయి రాఘవులతో భయపెట్టించ దలచారు. పాపం! ఇంకా నయం చంపించలేదు.

సాంబ:- అంతపనీ చేశాడు? నేననుకొంటూనేఉన్నా ఏదో గూడుపుఠాని ఉందని

శ్యాం:- లీలను పెళ్ళాడుతానన్నవ్యక్తిని భయపెట్టి మాన్పించాలని మా ప్రయత్నం. మీ నాటకమేమిటో ?

సాంబ:- వారం రోజులక్రితం నీవు పిచ్చిపిచ్చిగా ఉత్తరాలద్వారా ప్రేమపాఠాలు వల్లెవేస్తున్నావనీ, ఎక్కడైనా కన్పిస్తే వెంటబడి గోల చేస్తున్నావనీ లీల నాకు ఉత్తరం వ్రాసింది అందుకు నేనొక ఉపాయం చెప్పాను. 'లీలపెళ్ళి' అని పుకారు పుట్టించమనీ తరువాత రెండు రోజులలో వస్తానని లీలకు జవాబు వ్రాశాను.

శ్యాం:- మొదట పుకారు పుట్టించింది మీరేనన్నమాట.

లీల:- [ముసిముసి నవ్వులు నవ్వుతుంది]

సాంబ:- దాంతో నీ ప్రేమ మాంచి పాకంలో పడుతుందనీ, ఆప్రేమముదిరి పిచ్చిగా మారుతుందనీ, ఆ పిచ్చికుదిరేందుకే ఈ ఎత్తుపేశాం. అప్పుడుగాని నాటకం మంచి రసపట్టులో పడదుగదా!

శ్యాం:- ఎంతపని చేశావ్ బ్రదర్? అంతా గమ్మత్తుగా ఉందే?

సాంబ:- ఔను. అలాగే అనిపిస్తుంది.

శ్యాం:- లీలా! నన్ను క్షమించవూ?

లీల:- మీరే క్షమించాలి.

సాంబ:- లీలా నాయుడుగారు! ఓ౹ సారి లీలా! అయిపోయిందా మీ క్షమాపణల పేరం? తొందరగా వెళ్ళి వేషంమార్చుకొనిరా. ఈమగవేషంలోనే ఉండాలని పిస్తోందా ఏమి?

లీల:- పోన్లే అన్నయ్యా! ఎవరైనా చూస్తారేమోనని నాకుసిగ్గుగాఉంది. అయినా ఈ బ్రహ్మచారిఇంట్లో స్త్రీల దుస్తులుగూడ ఉంటాయాఅని.

శ్యాం:- అన్నట్టు మరచాను రాఘవులూ!

రాఘ:- [ప్రవేశించి] బాబుగోరూ?

శ్యాం:- లీలకోసం తెచ్చిన అదుస్తులు లీలకివ్వు

రాఘ:- ఆలాగేబాబూ [లోపలికి ప్రవేశించి లీలకుఇస్తాడు]

లీల:- [రూములోనికి పోతుంది.]

సాంబ:- అబ్బో! అద్వాన్సుగా తెచ్చిపెట్టుకొన్నట్టుందే?

శ్యాం:- ఇంకైనా నన్నేడిపించకురాబ్రదర్! స్వేచ్ఛగా, అనందంగా నన్నుగాలిపీల్చు కోనీ. రాఘవులూ మాంచి స్ట్రాంగ్‌కాఫీ తయారుచేయ్యి.

రాఘ:- అలాగేబాబూ [వెళ్ళిపోతాడు]

శ్యాం:- మూర్తీ ఎంతపని చేశావోయి?

సాంబ:- నాదేముందిలేవోయి. ఏదోగమ్మత్తు చేద్దామనుకున్నాం. రోజులు కలసి వాచ్చాయి. సరే! ఇప్పటికైనా బుద్ధివచ్చిందా

శ్యాం:- అబ్బా! ఏమిటది. చచ్చినపామునెందుకు కొడతావోయి. అసలే సిగ్గుగాఉంది

సాంబ:- ఉండమా పాపం! ప్రేమపాశాలు వల్లెవేస్తూంటే లేదూసిగ్గు కొండపేడు చాంతాడులాంటి ప్రేమలేఖలు వ్రాస్తున్నప్పుడు లేదుసిగ్గూ

శ్యాం:- బానొను! నీవుగూడా ఓ అమ్మాయిని ప్రేమించి కథంతా అడ్డంతిరిగి ఉంటే నేను చెప్పేదెందుకు నీకే తెలిసుండేది,

సాంబ:- నవవరునకు సన్మానం అంటే యింకెంత ఘనంగా ఉంటుందో అను కొన్నాను. సమయానికి లీలానాయుడు లీలగామారటం వల్ల సరిపోయింది.

శ్యాం:- కత్తిఝుళిపించి భయపెట్టమన్నాను. అంతేగానీ చంపమని చెప్పలేదే! అయినా మనరాఘవులా చంపేదీ అబ్బెబ్బే!

సాంబ;- ఔన్లే! అందకపోతేకాళ్ళు, అందితేజుట్టు.

శ్యాం:- అబ్బా నన్నుచంపకు. పోనీగాని థాంక్స్‌రాబ్రదర్ ఏమైతేఏం; మోదాంతం [Comedy] చేశావు నాటకాన్ని, లీలా! ఎంత పర్వదినం. అమరణాంతం మరపురాని ఘట్టం [ఉబ్బితబ్బిబ్బవుతాడు]

లీల;- [డ్రెస్‌చేసుకొని వస్తుంది.]

సాంబ;- [శ్యాంనుద్దేశించి] పరేఏమిచేద్దాం పిచ్చిగా ప్రేమగీతాలు పాడినందుకు నీకు [లీల నుద్దేశించి] సహాయాన మీయనందుకామెకు ... [అంటూండగా మధ్యలో రాఘవులు కాఫీతో ప్రవేశించి] నీవుచెప్పు రాఘవులూ! వారిద్దరికి ఏమిశిక్ష విధించ మంటావో

రాఘ;- ఏముంది బాబుగోరు! వాళ్ళిద్దరినీ ఓయింటివాళ్ళనుచేస్తేసరి. ఇహిహీ.... [అని నవ్వుతూ అందరికీ కాఫీలు ఇస్తాడు] [అందరూ కాఫీలుతాగుతుండగా]

సాంబ:- [సంతోషంతో] అలాగే! లీల అమ్మ నాన్నలుగూడ అంగీకరించారు. అందుకే వివాహ సంబంధం

లీల;- పోనిలే అన్నయ్యా! నీవు మరీను.

సాంబ:- [శ్యాంనుద్దేశించి] భగ్నప్రేమికులు తమరేమంటారు బ్రదర్!

శ్యాం:- ఏదో తమదయ....

సాంబ:- శుభమస్తు [అనినవ్వుతాడు]

[అందరూపెద్దగా నవ్వుతూండగా]

[తెర]



# "దేశం బాగు పడాలంటే"

**పాత్రలు:-**

1. కోమల:. వయస్సు సుమారు 25 సం.– నాజూగ్గా, శీవిగా, హుందాగా ఉంటుంది.

2. రామారావ్:– క్రొత్తగా బదిలీ అయిన సేల్సుటాక్సుఆఫీసర్– సుమారు 28 సం–

3. సి. ఐ. డి. శివం:– రామారావుకు సమవయస్కుడు.

4. జవాన్ భీమన్న:- సుమారు 50 సం. ల వయస్సు– నమ్మినబంటు–

5. సుందర్‌లాల్ సేఠ్‌జీ మిల్లుఅధిపతి

6. కూర్మయ్యశెట్టి ”

7. సదాశివబ్రహ్మం:- సబ్ ఇన్‌స్పెక్టర్

8. కనకయ్య:- కానిస్టేబిల్

[తెర ఎత్తగానే సేల్స్‌టాక్స్ ఆఫీసరుగది. గదిమధ్యన ఒక పెద్దటేబిల్- టేబిల్ ముందు గోడనానుకొని, రివాల్వింగ్ ఛైర్- తక్కిన మూడుప్రక్కల మూడు మామూలు కుర్చీలు- లెటరుస్టాండు, కాలింగ్‌బెల్, ఫైల్స్; చాకు, కాగితాలు- టేబిల్ మీద ఉంటాయి- ఎదుటిగోడకు గడియారము, నెహ్రూఫోటో, కొన్ని కేలండర్లు వ్రేలాడదీయబడి ఉంటాయి- ఎడమప్రక్క బయటనుంచి వచ్చి పోవడానికి, కుడి ప్రక్క ఆఫీసులోనికి వెళ్ళితావడానికి, వాకిళ్ల వాటికిడోర్‌కర్టెన్స్, అమర్చబడి ఉంటాయి- ఒకమూల్లో మంచినీళ్లకూజా, రెండుగ్లాసులు ఉంటాయి]

భీమన్న:- [కుర్చీలు, టేబిల్- తుడుస్తూ ఉంటాడు- కూనిరాగం తీస్తూంది, తక్కిన ఆగిపోయి నెహ్రూఫోటోను చూస్తూఉండగా]

రామారావ్:- [ఫుల్‌షూట్‌లో ఉంటాడు- హేట్‌తీసి టేబిల్‌మీద ఉంచుతూ....] భీమన్నా !

భీమన్న:- [వినిపించుకోడు]

రామారావ్:- [గట్టిగా] భీమన్నా నిన్నేనోయ్ చెవిటీ!

భీమన్న:- [తమాయించుకొని, చిరునవ్వుతో, పిలవుతూ....]

నమస్కారం బాబుగోరు ! నా మతిమంతా ? మరిసేపోయాను బాబుగోరు! తప్పైంది.

రామారావ్:- ఆ ( ఆదిన రేగానీ, ఏమిటి అంసుకొంటున్నావ్

భీమన్న:- రోజూగేటు దగ్గిర కొచ్చేనేను ఈరోజు ఎందుకు రాలేదంటున్నారా బాబుగోరూ ? చెప్పానుగదా బాబుగోరూ ? ఈమద్దె మతిమరుపెక్కువైంది బాబుగోరు

రామా:- [కంఠస్వరం హెచ్చించి] అదిగాదోయ్! నీకు నీవే మాట్లాడుతుంటున్నావే ఏమిటి అన్నాను.

భీమన్న :- ఓస్ అదాబాబు గోరూ! [నెహ్రూ ఫోటూచూపిస్తూ] అయనగోర్ని తల్చుకొంటాను బాబుగారూ !

రామా.- అలాగా! కానీ భీమన్నా! నీపేరైతే పెట్టారుగానీ నీవు భీముడిలాలేవే? [అంటూ సైగచేస్తాడు]

భీమన్న:- నేను లావెక్కానంటారా బాబుగోరూ? అవ్వ.

రామా:- [గట్టిగా] కాదోయ్ లావుగాలేవన్నాను-

భీమన్న:- [నవ్వుతూ] ఓస్. అదా బాబుగోరూ-

రామా:- సరే! కొంచెం మంచినీళ్ల [సైగచేస్తాడు] నీతో మాట్లాడేందుకు మా తాతలు దిగిరావాలి.

భీమన్న:- [మంచినీళ్లగ్లాసు అందిస్తాడు]

రామా:- [నీళ్లత్రాగి, గ్లాసుఇచ్చివేసి, ఫైల్సు చూస్తూంటాడు.] భీమన్నా!

భీమన్న:- బాబుగోరు!

రామా:- [ఒకకాగితం ఇస్తూ] ఇది అర్జంటుగా టైప్ చేయించుకొచ్చేయ్.
[సైగచేస్తాడు]

భీమన్న:- అట్లాగే బాబుగోరు. ఎంతసేపు ?నిముసంలోరాను [వెళ్ళిపోతాడు]

రామా:- [ఫైల్సు చూస్తూఉంటాడు]

భీమన్న:- [వచ్చికాగితం అందిస్తాడు]

[బయట నుంచి తలుపుతట్టిన శబ్దం]

రామా:- భీమన్నా! ఎవరోచూడు [సైగ]

భీమన్న:- [బయటికి వెళ్ళివచ్చి, నవ్వుతూ] బాబుగోరు! అమ్మగోరు వచ్చారండి!

రామా:- ఏ అమ్మగోరు!

భీమన్న:- ఆయమ్మగోరే-కోమలమ్మగ్గారు-

రామా:- ఓహో! రమ్మను.

భీమన్న:- [బయటికి వెళ్ళివస్తాడు]

[అతని వెనుకే కోమల, సేఠ్‌జీ, కూర్మయ్య వస్తారు]

కోమల:- గుడ్‌మార్నింగ్!

రామా:- వెరీగుడ్ మార్నింగ్! రండి. ఇలా కూచోండి

[ముగ్గురూ కూర్చుంటారు]

కోమల:- చాలాథ్యాంక్స్! మొన్న వీరిని గురించి మీకు చెప్పాను. ఈయనే సుందలాల్ సేఠ్‌జీ. మా నాన్న తరువాత చెప్పుకో దగ్గ ధనవంతుడు.

సేఠ్‌జీ:- నమష్కార్‌జీ!

రామా:- నమస్కారం.

కోమల:- ఆయనషావుకారు కూర్మయ్యశెట్టి ఈ ఊళ్ళో చెప్పుకోదగ్గషావుకారు.

రామా:- అవునవును.

కోమల:- అరే మీకెలాతెలుసు ?

రామా :- చూస్తుంటే తెలియటంలా ?

కోమల :- ఓహో! అదా? [నవ్వుతుంది]

కూర్మ:- నమస్కారం బాబుగారు!

రామా:- నమస్కారం. ఈ రోజు చాల పర్వదినం. ఈ నగరంలో ముఖ్యమైన ముగ్గురు వ్యక్తుల్ని 'బిగ్‌త్రీ'ని చూడగలిగాను. చాల సంతోషంగా ఉంది.

కోమల:- నాకు కూడ చాల ఆనందంగా ఉంది. మన ఎం.ఏ. ముగిసిన ఐదేండ్ల తరువాత మిమ్మల్ని కలుసుకొన్నాను. అందులోను మాకు కావలసిన ఆఫీసర్‌గా వచ్చారు.

రామా:- కావలసిన అంటే?

కోమల:- మీకు తెల్సిందేముంది? మేముమిల్ ఓనర్సుము. మీరు సేల్స్‌టాక్సు ఆఫీసరు? ఏమంటారు సేఠ్‌జీ ?

పేఠ్‌జీ :- జీహాఁ! జీహాఁ! అది అంతే. మీసే దయమాకి కావాలిసాబ్!

కూర్మ:- ఔను బాబుగారు మీదయ ఉండాలే గాని లాభాలకేంలోటు ? లాభాల మీద లాభాలు [నవ్వుతాడు]

రామా.- నా దయేంటి? లాభాలేంటి ? మీ మాటలేమిటో బోధపడలేదు.

కూర్మ:- అదీ అంతేలెండి బాబుగారు. కొంత సేపటిలోనే మీకు బోధపడుద్ది.

పేఠ్‌జీ:- ఐసాబోలో. కొంచెం ఉంటే మీకుతెలుస్తుంది సాబ్.

కోమల:- మీకా విషయాలు సవిస్తరంగా నేను తరువాతచెప్తా. మీకు పరిచయం చేద్దామని వీరిని తీసుకొచ్చా అంతే. మరివెళ్ళనా?

రామా:- సరేమంచిది

[ముగ్గురూనిష్క్రమిస్తారు]

రామా:- భీమన్నా! భీమన్నా!

భీమ:- సిత్తం బాబుగోరు!

రామా:- వీళ్ల గురించి నీ కేమైనాతెలుసా?

భీమన్న:- కోమలమ్మగోరు బాగుంటారంటున్నారా బాబుగోరూ?

రామా:- అదిగాదోయి. నీ చెముడుతో చస్తున్నాం.

భీమ:- ఏటిబాబుగోరూ?

రామా:- వాళ్ళు నాదయ అంటున్నారే ఏంటి [ఒత్తిత్తిపలుకుతాడు]

భీమన్న:- ఓస్ అదా బాబుగోరూ! అదిపెద్దసిక్రే!

రామా:- ఏమిబోయి? చిక్కేమిటి?

భీమన్న:- ఆళ్ళుముగ్గురూ గరానా మడుసులు. ఆళ్ళినమ్మొద్దండి బాబుగోరు.

రామా:- ఏమిటిసంగతి? [సైగ]

భీమన్న:- ఆళ్ళు ముగ్గురు మాంచి డబ్బుగలాళ్ళు బాబుగోరూ! మిల్లులుంటాయి. ఆటిలో మంచిలాబాలు. పన్నులు ఎగ్గొట్టానికి పన్నాగం. ఈ ఊరొచ్చిన ఆఫీసర్లంతా ఆళ్ల సేతుల్లో బొమ్మలు బాబుగోరు ఆడిస్తారు.

రామా:- ఓహో అలాగా! వీళ్లగురించి అప్పుడే కొంత విన్నానోయి.

భీమన్న:- సిగ్గులేకుండా బతకాలంటే ఆళ్లతో కలసి ఉండడమే. ఎదురు తిరిగితే మాపెమాదం బాబుగోరు.

రామా:- ఐసీ! ఆ ప్రమాదమేమిటో నేనుచూస్తాను. వాళ్ళఅంతు తేలుస్తా [చాకుతో కవరు చించుతాడు టపాల్ చూస్తుంటాడు]

భీమన్న:- ఆళ్ళతో పంతం పట్టకండిబాబుగోరు. ఆళ్ళతో మంచిగా ఉండడమే మంచిది.

రామా:- అయితే వాళ్ళు చెప్పినట్టు వినమంటావా?

భీమన్న:- ఆ ( అంతే బాబుగోరు.

రామా:- ఛీ! ఛీ! అలాంటిది మా ఇంటా, వంటా లేదు. భీమన్నా! ఏం జరిగేది నీకే తెలుస్తుందిలే! ఆ (. సరేగానీ- ఈఫైలు మేనేజరుకివ్వు. ఇంకా కాగితాలుంటే వట్రా

భీమన్న:- సిత్తంబాబుగోరు. [ఆఫీసులోకి వెళతాడు]

రామా:- ఆలోచిస్తూ ఉంటాడు.

[కోమల ప్రవేశిస్తుంది]

కోమల:- ఆఫీసరుగారేమిటో ఆలోచనలో ఉన్నారే?

రామా:- [తలపైకెత్తి ఆశ్చర్యంతో] అరే అప్పుడే వచ్చారే?

కోమల:- ఆ ( ఊరకనే! ఏమితోచలేదు అందుకని.

రామా:- ఏమో! ఊరకగారు సామెత ఉందిగా?

కోమల:- ఔనౌను ఉంది. [కలయచూచి] అబ్బా! భీమన్నగూడా లేడు. హాయిగా ఉంది.

రామా:- ఏమిటీ ?

కోమల:- మనసిచ్చి మాట్లాడుకోవచ్చుగా ?

రామా:- ఇదిమనఇల్లేమీకాదు. మనసిచ్చి మాట్లాడేరోజులు గతించాయి.

కోమల:- అయితే మనసు మార్చుకొన్నారా ?

రామా:- ఏ విషయంలో

కోమల:- మన "మేరేజ్" విషయంలో !

రామా:- మన "మేరేజ్"! [పెడనవ్వు] నేను ఆరాధించిన సమయంలో మీరు కాదన్నారు. నా కనవసరమైనప్పుడు మీరు ఆశ చూపుతున్నారు. ఆ అయినా ఆగొడవ దేనికి

కోమల:- అనవసరమంటే .... మీరు ఆజన్మాంతం బ్రహ్మచారిగా ఉండిపోతారా

రామా:- నాకలాంటి కర్మేమీ పట్టలేదు. కొద్దిరోజులలోనే మీకు మా "మేరేజ్" ఇన్విటేషన్‌కార్డు వస్తుంది.

కోమల:- [ఆశ్చర్యంతో] ఆ ( నిజంగానా

రామా:- అసత్యం చెప్పాల్సిన పనినాకులేదు.

కోమల:- అయితే నా ఆశ నిరాశేనా

రామా:- ఎందుకు ధనవంతులు, రూపవంతులు, మహామహులు ఎంతోమంది ఉన్నారు.

కోమల:- అయితే మీ మీదఆశ వదలుకో మంటారా

రామా:- అయితే నా మాటలో విశ్వాసం లేదంటారా

కోమల:- ఉంది, లేకేం కాని ఇప్పటికిగూడ మించిపోయిందిలేదు. రావుగారూ ! మీరు మనసు మార్చుకొంటే ఎప్పటికైనా మిమ్మల్ని పెళ్ళాడ్డానికి సిద్ధంగా ఉన్నాను ఆలోచించుకోండి.

రామా:- అది ఈజన్మకు సాధ్యంగానివని. ఆలోచనకు అవకాశమేలేదు. అందుకే "ఎప్పటికెయ్యది ప్రస్తుతం...." అన్నారే దాన్ని ఆలోచించండి.

కోమల:- అయితే మీ దురదృష్టం.

రామా:- కాదు నా అదృష్టం. నేనెంతో సంతోషిస్తున్నాను.

కోమల:- ఆఁ సంతోషిస్తున్నారా ?

రామా:- ఔను. లేక దుఃఖించమంటారా

కోమల:- అబ్బే నేనలా అన్నానా లేదే కానిరామారావుగారూ ఒకటి మాత్రం గుర్తుంచుకోండి. ఏనాడు మీ మనసు మార్చుకొన్నా మీకోసం మిమ్మల్ని స్వీకరించడానికి ఒకవ్యక్తి ఉన్నదనే విషయాన్ని మాత్రం మరచిపోకండి.

రామా:- అది వృథాప్రయాస. ఆవిషయం వదలిపెట్టండి. అప్పుడుమీరు 'అల్సేషియన్' కుక్కను సాకుతూ వుండేవారు ఇప్పుడుదాన్ని మీ వెంట తీసుకు రాలేదే

కోమల:- అది దుఃఖపూరితవిషయం. అయినా మీరడిగారు చెబుతున్నా మన ఎం. ఏ. ముగిసిన సంవత్సరాని కనుకొంటాను. మా నాన్నగారు స్వర్గస్థులయ్యారు.

రామా:- అరే! అలాగా! సారీ కోమలగారూ !

కోమల:- ఆ మరుసటి సంవత్సరం నా ప్రియమైన 'అల్సేషియన్' కుక్క లారీ క్రిందపడి చచ్చిపోయింది.

రామా:- అలాగా అయితే డబుల్ కండొలేషన్స్.

కోమల:- [కళ్ళొత్తుకొంటుంది] ఆఁ పోనీండి. గతించిన విషయాల్ని గురించి మాటలాడి ప్రయోజనంలేదు. [కంఠంసవరించుకొని] రావుగారూ !

రామా-: ఆఁ చెప్పండి. ప్రయోజనమున్న విషయమే చెప్పండి.

కోమల:- మీ శ్రేయోభిలాషిణి అయిననేను ఇక్కడి విషయాలు కొన్ని చెప్పాలి.

రామా:- ఆఁ అదే నేనూకోరేది.

కోమల:- మా నాన్నగారు, వారి తరువాత నేను, పేట్‌జీ, కూర్మయ్య ముగ్గురు ఈ నగరంలో చాలా ముఖ్యులం.

రామా:- అయితే

కోమల:- ఇంతకు ముందు మీ స్థానంలో వచ్చిన ఆఫీసర్లు చాలామందీ మాతో మంచిగా ఉంటూ వచ్చారు.

రామా:- ఇప్పుడు నేనుమాత్రమేనా మంచిగాలేంది

కోమల:- ఏమో ! మీ మంచిగోరి, మనపూర్వ పరిచయాన్ని పురస్కరించుకొని చెప్తున్నా. మాతో సహకరించడం చాలా అవసరం.

రామా : మీరేమంటున్నారో నాకు బోధ పడలేదు సరిగ్గా!

కోమల : బోధపడేట్టుచెప్తా మరి సెలవ్.

రామా : సరే దయచేయొచ్చు.

కోమల : తప్పక దయచేస్తా. సేఠ్‌జీ కూర్మయ్యలతోపాటు వచ్చి ఈ విషయం వివరిస్తా [నిష్క్రమిస్తుంది]

రామా : [నెమ్మదిగా పోతోంటే చూస్తూ] వీళ్లేమో ఏదో ఎత్తుగడ వేయడానికి ప్రయత్నిస్తున్నారు. వాళ్ళజిత్తులు మనదగ్గరసాగవు అటకట్టిస్తా. పవిత్ర భారతభూమిపై యిట్టిదురాగతాలు కొనసాగడాని కే మాత్రము వీల్లేదు. ఇది నా దృఢ సంకల్పం. [అంటూ ఆలోచిస్తుండగా భీమన్న ప్రవేశం....]

భీమన్న : [మెల్లగా] బాబుగోరూ!

రామా : [మౌనం]

భీమన్న ; బాబుగోరూ!

రామా : [తలెత్తి] భీమన్నా! ఓగ్లాసు మంచినీళ్లు!

భీమన్న : ఆలెస్సంగా ఒచ్చానంటారా బాబుగోరూ!

రామా : [అబ్బబ్బా] మంచినీళ్ళు [సైగచేస్తాడు]

భీమన్న : మంచినీళ్ళుఇస్తాడు]

రామా : [నీళ్ళుత్రాగి] ఎక్కడికెళ్ళావ్ ఇంతవరకు [సైగ]

భీమన్న : ఏదో పనుండి ఇంటికాడికెళ్ళాను బాబుగోరూ. చమించండి

రామా : రోజు ఏదో వెధవపని చేయడం. క్షమించమనడం నీ కలవాటైంది పాడిందేపాటరా పాచిపళ్ళదాసరి అన్నట్లు.

భీమన్న : అదిగాదు బాబుగోరూ!

రామా : ఏదిగాదోయి ?

[అంటూండగా సి. ఐ. డి శివం ప్రవేశిస్తాడు]

శివం : [ప్రవేశిస్తూ] గుడ్‌మార్నింగ్. మిస్టర్‌రావ్ ?

రామా : [ఆశ్చర్యంతో] అరే వెరేగుడ్‌మార్నింగ్ శివం! కమిన్ ఇదిగో భీమన్నా!

భీమన్న : బాబుగోరు!

రామా : రెండుటీ. తొందరగా రావాలి.

భీమన్న : అలాగే బాబుగోరు. నిముసంలోరాను [వెళతాడు]

రామా : రావోయి శివం. ఇలాకూచో! సి. ఐ. డి. శివం చాలాబాగ కుదిరిందోయి. ఎప్పుడురాక? ఏమిటిసంగతి?

శివం : ఈ మహానగరానికి ఈవేళే వచ్చాను. వచ్చీరాగానే నీవద్దకే వచ్చాను. ఇది నారాక? ఇక సంగతంటావా ? నీ సహాయంకూడా అవసరం.

రామా : నా సహాయంకేం? ఎల్లప్పుడూ ఉంటుంది. కాని నీ సహాయం మాత్రం వెంటనే కావాలి.

శివం : అలాగా! అయితే నీ కెలాంటి సహాయంకావాలి.

రామా : నాకు పెద్దచిక్కుసమస్య ఎదురైంది. పరిష్కరించే బాధ్యతనీది.

శివం : అసలు సంగతేమిటో చెప్పుమరి?

[భీమన్న ఇద్దరికిటీ ఇస్తాడు. టీ త్రాగుతూ ఉంటారు శివం సిగరెట్టు వెలిగించి రామారావుకు ఒకటి ఆఫర్ చేస్తాడు.

రామా : [సిగరెట్టు అందుకొంటూ] అరే! ఈరోజు సిగరెట్ సంగతేమరచాను. [అంటూ వెలిగిస్తాడు] ఈ ఊళ్లో ముగ్గురు అయిల్ మిల్లు ఓనర్సు ఉన్నారు. కోమల, సుందర్‌లాల్, సేఠ్‌జీ, కూర్మయ్య- అని కోమల ఎం. ఏ. లో మన క్లాస్‌మేట్ నీకు జ్ఞాపకముందనుకొంటా.

శివం : ఆహాఁ! లేకేం! బాగా జ్ఞాపకం !

రామా : సేఠ్‌జీ, కూర్మయ్యలు కోమల సహాయంతో ఆఫీసర్లను లోబరచుకోడానికి ప్రయత్నిస్తున్నారు. సేల్సుటాక్సు ఎగ్గొట్టడానికి యత్నిస్తున్నారు.

[భీమన్న ఖాళీగ్లాసులు తీసుకెళతాడు]

శివం ; ఈవిషయంనాకు తెలిసిందే, అసలు వీళ్ళగురించి దర్యాప్తు చేయడానికే ఈ

వేళ నేను ఈడకొచ్చాను. దైవవశాత్తు నీవుగూడ ఉండడం నా కెంతో సంతోషదాయకం.

రామా ; అయితే సంగతివిను. కోమల నన్నుతన ప్రేమాస్త్రంతో వశపరచుకో జూసింది పాపం!

శివం : ఓహో! అలాగా! డామిట్! నీవు ప్రేమించినప్పుడు లేదుగాని, ఇప్పుడు పుట్టుకొచ్చిందటనా ప్రేమ? ఇలాంటి వాళ్ళని ఏమిచేసినా పాపంరాదు.

రామా : బాగా బుద్ధిచెప్పావులే, ఇక్కడకు వచ్చిన ఆఫీసర్లంతా వీళ్ళ అడుగులకు మడుగులొత్తారట! ఒత్తనివాళ్ళు బాగా దెబ్బతిన్నారట! పాపం! తాను ప్రయోగించిన ప్రేమాస్త్రం విఫలమైంది. అందుకని లంచమనే బాణాన్ని ప్రయోగించేందుకు ప్రయత్నిస్తున్నారు. ఆవిషయమై మాట్లాడేందుకు సేట్ జీ కూర్మయ్యలతోపాటు వస్తానంటూ వెళ్ళింది కోమల.

శివం : ఎస్, నాటకం మాంచి రసకందాయంలో పడిందన్నమాట.

రామా : వీళ్ళు ఏ నిమిషంలో ఏంచేస్తారోకూడా తెలీదు. అయినా నేనే మాత్రం వీళ్ళకు భయపడను. అందులోను నీవుగూడ ఉన్నావుగనుక నా కసలే భయంలేదు.

శివం ; వాళ్ళ అంతునేను కనుక్కొంటా నీ మట్టుకు నీవుండు.

రామా : అబ్బా! థాంక్స్‌రా బ్రదర్ [అంటూ కరచాలనం చేస్తాడు]

శివం ; ఆ! ఇప్పుడెందుకు? మనం అనుకొన్నపని పూర్తికావాలి. అప్పుడు మన మజా. అయితే రావ్! దట్సాప్తు ఈరోజు-కాదు- ఈక్షణం నుంచే ప్రారంభం ఏ నిమిషంలో ఏం జరుగుతుందో అన్నావేగదూ? నీవు నిశ్చింతంగా ఉండు.

రామా : ఐయామ్ రియాలీగ్లాడ్. మనిద్దరిమధ్య ఉద్యోగధర్మాన్ని నెరవేరుస్తూ దేశంకోసం పాటుబడదాం.

శివం ; తప్పకుండా మనం అనుకొన్నకార్యం నెరవేరుతుంది. మరినేను వెళ్ళిరానా? నీ కేవిధమైన సంకోచమువద్దు. నేను నీదగ్గరే ఉన్నాననుకొని మసలుకో. మసిభవించిన కుళ్లు నంతటిని నాశనంచేసి తీరుతాం. విష్‌యూగూడ్‌లక్! [వెళతాడు]

రామా : సరే థాంక్స్! [ఫైల్సులో మునిగిపోతాడు- ఏదో గుర్తుకువచ్చినట్లు గదంతా కలియజూసి ఒళ్ళు విరుచుకొని, కాలింగ్‌బెల్ నొక్కి లేచి కోటు విప్పి కుర్చీకితగిలించి, ఆలోచిస్తూ పచార్లు చేస్తుంటాడు]

[కళ్ళురుద్దుకుంటూ భీమన్న ప్రవేశిస్తాడు]

భీమన్న ; పిల్చారా బాబుగోరూ!

రామా ; ఏం చేస్తున్నావ్ ఇంతదాక!

భీమన్న ; నిద్దరోయి ఒస్తున్నానంటారా బాబుగోరు?

రామా : ఓహో! ఇందాక కునికిపాట్లుపడి వస్తున్నావా? [సైగ]

భీమన్న ఔను బాబుగోరు. మరేరాతిరి దాంతస్సదీయ్యా నిద్దరేవాలేదు బాబుగోరు.

రామా : పగటినిద్ర పనికిరాదని తెలీదటోయి ?

భీమన్న : అదిగాదు బాబుగోరు!

రామా:- అబ్బా! నీతో వచ్చినచిక్కేయిది. ఆఁ!ఏదిగాదు ? (గట్టిగా అంటాడు)

భీమన్న:- ఇయాల వొచ్చారే ఆయన నెవరు బాబుగోరూ?

రామా:- ఆయన నేను ఒకే చోట చదువుకొన్నాం.

భీమన్న:- మీసుట్టమంటుండరా బాబుగోరూ?

రామా:- [విసుగ్గా] అబ్బా. కాదోయ్. నేచెప్పేవొకటి. నీవు చెప్పేదొకటి.

భీమన్న:- ఇంకేటి బాబుగోరూ ?

రామా:- ఆయన సి.ఐ.డి. ఇన్‌స్పెక్టర్ శివం. కొత్తగా బదలీ అయ్యాట్ట. [నొక్కి నొక్కి పలుకుతాడు]

భీమన్న:- ఓస్. అలాగబాబుగోరూ! ఈయన 'గోరికి అమ్మగోరుండారా బాబుగారు?

రామా:- [గట్టిగా] ఆఁ! పిల్లలు గూడ ఉన్నారు.

భీమన్న:- ఓస్. మరిమీరు మాత్తరం బిమ్మసారిలా ఎందుకు బాబుగోరు ఉండారు? ఏగం పెళ్ళి చేసుకోండి బాబు మీరు!

రామా:- అలాగేవోయ్! చెప్పుతున్నాగా, తొందర్లోనే చూద్దువుగాని!

భీమన్న:- ఓస్. మాసంతోసంగా ఉండది బాబుగోరూ? నాకేమో మంచిబోమానం ఇచ్చుకోవాలి బాబుగోరూ!

రామా:- తప్పకుండా ఇస్తాను లేవోయ్ [అంటూ సంతోషంగా పచార్లు చేస్తూండగా సేఠ్‌జీ, కూర్మయ్యలతోపాటు 'నమస్తే' అంటూ కోమల ప్రవేశిస్తుంది. భీమన్న అదోరకంగా చూస్తాడు-]

రామా:- [కొంచెం విసుగ్గా] ఏమిటి మళ్ళీవచ్చారే ? [మర్యాదకోసం] కూర్చోండి.

కోమల :- చాల థాంక్స్ [కూర్చుంటుంది] [సేఠ్‌జీ, కూర్మయ్యలు కూడ కూర్చుంటారు]

రామా:- ఏమైనా అర్థంటుపనా ?

కోమల:- అబ్బే అంతఅర్జంటేమీలేదు. కాకపోతే, మీకు ఇంతకుముందే చెప్పాను. మనం సేల్స్‌టాక్స్ విషయమై ఏవో 'టర్మ్స్' మాట్లాడు కొందామని అందుకు వీళ్ళను గూడ తెచ్చాను.

రామా:- కోమలగారూ! ఆలోచించే మాట్లాడుతున్నారా ?

కోమల:- మేం బాగా ఆలోచించుకొన్నాం. మీరింకా ఆలోచించినట్లు లేదు. అయినా కష్టంగాదు. ఆలోచించండి.

సేఠ్‌జీ:- అవునుసాబ్! మీరు 'యస్' అంటే సాబ్! నోట్లకట్టలు మీది ముందు ఉంటుందిసాబ్! జర ఆలోచన సేయండిసాబ్! నీది మంచికి బోల్‌తున్నాం సాబ్! ఏమిసెప్తారు కూర్మయ్యాజీ.

కూర్మయ్య:—అంతే బాబుగారూ! మీరు ఊఁ! అంటే చాలు. వేలకువేలు గుమ్మరిస్తాం. ఏవో మిదయ.

రామా :— అదీ ఈ జన్మలో జరిగే పనికాదు. ఎందుకు అనవసరంగా మాట్లాడుతారు? నన్ను డబ్బుతో లొంగదీయలేరు. మీతరముగాదు !

కోమల:— సారీ మిష్టర్‌రావ్! అది జంట్ల్‌మన్ లక్షణంకాదు.

రామా :— పోనీ జంట్లీఉమన్ లక్షణమా ?

కోమల:— అప్పేఅదెన్నటికీకాదు. అదే అయితే మామాటను కాదనే వాళ్ళేకాదు.

[కోమల, కూర్మయ్య, సేఠ్‌జీ ఏదో రహస్యంగా మాట్లాడుకొంటారు]

కూర్మ : అయితే కేసు చూస్తాం. ఎందుకు జరగదో! లేవండి సేఠ్‌జీ! ఈరోజే ఏదో ఒకటి తేలిపోవాలి.

సేఠ్‌జీ : జీహాఁ జరూర్ హోనా! కోమలమ్మ! మేముపోతాం. మీదిపోస్ట్రీకి చెప్పండి ఎందుకు తకలీఫ్ తెచ్చుకొంటార్. పోతాంసాబ్! రామ్ రామ్.

రామా : శుభం వెళ్ళిరావచ్చు.

కూర్మ : వస్తాం. తప్పకవస్తాం [కూర్మయ్య, సేఠ్‌జీ వెళ్ళిపోతారు]

రామా : మీరు దయచేయరా?

కోమల : వెళతాను. వెళ్ళిమళ్ళీవస్తాను.

రామా : దేనికి ? మీరు వెళ్ళితేచాలు రానక్కర్లేదు.

కోమల : అంత విసుగైతే ఎలాగా? మిస్టర్‌రావ్! ప్రపంచంలో సుఖంగా బ్రతికే పద్ధతులే మీకు తెలీనట్లుంది. ఈ విషయంలో మిమ్మల్ని పిటీ చేస్తున్నా !

రామా : అంటేనాకు ఆమాత్రం కామన్‌సెన్సు లేదంటారా? సివిలిజేషన్‌లేదంటారా.

కోమల : ఎగ్జాట్లీ ! ఎంత ఎప్రోప్రియేట్‌గా వాడారాపదాన్ని. 'సివిలైజ్డ్' అంటే లౌకికుడని అర్థం.

రామా : మీ రిచ్చినఅర్థం చాలాబాగుంది మీలాంటివాళ్లు ఉండబట్టే దేశమిలా అథః పతనం చెందుతుంది.

కోమల : కాదు బాగుపడుతుంది. కానీ నేనొకటి మాత్రం చెప్పగలను. సామదాన భేద, దండాలనిగదా ఉన్నాయి ఉపాయాలు. అందులో రెండో ఉపాయాన్ని మేము లక్ష్యంగా ఉంచుకొన్నాం.

రామా : అయితేనేను శత్రులోటిలోని వాడన్నమాట! శత్రువును దానోపాయంతో జయిస్తారా? అయినా కోమలగారూ! చెప్పేదీ సూటిగా చెప్పండి. ఇంత డొంకతిరుగుడెందుకు ? చేసేది నీచకార్యమైనా ఉపయోగించే పదాలు మాత్రం చాలాపెద్దవి. అవును అదే పెద్దమనుష్యుల లక్షణం.

కోమల : మీరేమైనా అనుకోండి. మేము మల్టీమిలియనీర్సు!

రామా : అవును తెలుస్తూనే ఉంది.

కోమల : అనుకొన్నామంటే మేమైనా చేయగలం!

రామా : అందుకు గోటితో పోయేవానికి గొడ్డలెందుకంటారు ?

కోమల : కరెక్ట్! మీ సామెత ఆ సామెతలాగ సరిపోయింది.

రామా ; ఇంతెందుకు ? మీ ఆయిల్ మిల్లులవిషయం పట్టించుకోకుండా నన్ను లంచం పుచ్చుకోమంటారు. అంతేనా ?

కోమల ; అబ్బే ! లంచం అని నేననలేదే? మీరూ మేమూ రాజీగా ఉంటానికని....

రామా ; కోమలగారూ! నా సిద్ధాంతాలు మీకు తెలుసు. మరి తెలిసి తెలిసి వృథా ప్రయాసదేనికి ? నా సిద్ధాంతాలకై నాప్రాణాలైనా లెక్కచేయను. ఈ విషయం మీకు తెలిసిందే ! అయినా మళ్లీమీకు చెపుతున్నా!

కోమల : రావుగారూ! నేను మీమంచిగోరి చెప్తున్నా! కాలానుగుణంగా మనమూ మారవలసి ఉంటుంది. అవిధంగా మారితేనే సుఖం. ఇదివరకటి ఆఫీసర్లు తదితర అధికార్లు చూచీచూడనట్లు పోవడంలేదా! బ్రతకనేర్వడం తెలిసి మసలుకోవడంలేదా!

రామా ; అది మీవంటి వారికేసాధ్యం. ఊసరవెల్లి రంగులుమార్చినట్లు! ఇతర ఆఫీసర్ల ప్రమేయం నా దగ్గరవద్దు.

కోమల : రావుగారూ! మీకు మామధ్య మసలటం విషసర్పాలతో చెలగాటం.

రామా : అవును నాకుతెలుసు. విషసర్పాల కోరలు తీయడం. ఆలా చేసిననాడే దేశం బాగుపడుతుంది. మీరు ఎం. ఏ. చదివారు. మీ చదువువల్ల కలిగిన సంస్కార మిదన్నమాట ?

కోమల : భగవంతుడు విజ్ఞానం ప్రసాదించింది బ్రతకడం నేర్చుకోడానికిగాని తన్నునాశనం చేసుకోడానిక్కాదు మిస్టర్ రావ్ !

రామా : ఓహో అలాగా ! మీకు భగవంతుని మీద నమ్మికకూడ ఉందా ?

కోమల : ఇంతెందుకు ? నేను మొదటే చెప్పాను- నేను మీ శ్రేయోభిలాషిని అని. మనం చదువుకొంటూన్న రోజులలో మీరు వ్రాసిన రెండు లవ్ లెటర్లు నా దగ్గరున్నాయి.

రామా : ఉంటే నాకు భయమేమిటి?

కోమల ; ఏదో మీకు "మేరేజ్ ప్రపోజల్" ఉందన్నారుగదూ? ఈ 'లవ్ లెటర్సు'తో నేనెంత పనైనా చేయగలను.

రామా ; మీకు చేతనైంది చేసుకోండి. బెదిరించకండి. మిమ్మల్ని విరిగి నెత్తినపడ్డా నేను భయపడను. కానీ మీరీ విధంగా తయారైవందుకు చింతిస్తున్నాను. అడదాని హృదయం అమృతంతో సమానమంటారే?

కోమల : అందుకే మీకేహానీ కలుగకుండా ప్రయత్నిస్తున్నాను.

రామా ; స్త్రీలో అమృతంకాదు హాలాహలం ఉంది. మీ పేరెవరు పెట్టారోకాని, అది నేతిబీరకాయ,

కోమల : నా వ్యక్తిగత విషయాలను గురించి చెప్పవలసినవని మీకులేదు.

రామా : నా విషయంలోను అంతే. మీ పార్ట్నర్‌షిప్ నుంచినన్ను తొలగించాడు భగవంతుడు. అందుకు సంతోషిస్తున్నాను.

కోమల : నేను చింతిస్తున్నాను. మీ శ్రేయస్సును గోరిచెప్పుతున్నా మేముచెప్పిన 'టర్మ్స్'కు అంగీకరించండి.

రామా : ఏమిటి కోమలగారూ ? నన్ను 'బ్లాక్‌మెయిల్' చేస్తున్నారా ? మీరు వెళ్ళిపోవచ్చు. ఇది ఆఫీసనే సంగతి మరచిపోతున్నారు.

కోమల ; లేదు నాకు బాగాతెలుసు. కొద్దిక్షణాల్లో సేఠ్‌జీ, కూర్మయ్యలతోపాటు వస్తాను. సెలవు [వెళ్ళిపోతుంది.]

రామా : ఎస్ గుడ్‌బై [ఆలోచిస్తూ పచార్లు చేస్తూంటాడు]

[ఫోన్ మ్రోగుతుంది]

రామా : హలో! ఎవరు ?

.....................

రామా ; మీరు ఎం. ఎల్. ఏ. రంగారావుగారా ?

.....................

రామా : నా కోసమా ? ఎవరూరాలేదండీ!

రామా : ఓహో ! కోమలగారువాళ్ళా !

రామా : వారుగాక మరెవరూరాలేదే !

రామా : ఎవరు ? ప్రెసిడెంటుగారా! రమ్మనండి. కానీ ఎవరువచ్చినా నేను చేయగలిగిందేమీలేదు.

రామా : అవసరమంటారా! నాకేమీలేదండి. ఫోన్ పెట్టేస్తారా. సరే పెట్టేయండి.

భీమన్న : బాబుగోరూ!

రామా : మంచినీళ్ళపట్రా! వీళ్లీ దేశానికి చీడపురుగులు. ప్రెసిడెంటు వస్తాడా ? రానీ ... (కోపంతో పచార్లు చేస్తూ ఉంటాడు)

భీమన్న : టీనా బాబుగోరూ ? నిమిషంలో ఒస్తాను బాబుగోరు !

రామా : వెరీగుడ్! బాగా జ్ఞాపకం చేశావు! నా తల వేడెక్కింది. ఉష్ణంఉష్ణేన శీతలం అందుకని వెంటనేవెళ్ళి మాంచి హాట్ టీ తీసుకురా [సైగ] ఈ బోర్‌డమ్ పోవాలంటే టీ యే కావాలి.

భీమన్న : అలాగే బాబుగోరు! [అంటూ వెళ్ళిపోతాడు]

రామా : [నెహ్రూ ఫోటోనుచూస్తూ] లంచగొండి తనాన్ని పోగొట్టాలంటే లంచం తీసుకొనే ఉద్యోగుల్ని శిక్షించడమేకాదు లంచగొండి తనాన్ని ప్రోత్సహించే ప్రజానీకంపైగూడ తగిన కఠినచర్య తీసుకోవాలి. సేర్‌జీః కూర్మయ్య. కోమలల వంటి చీడపురుగుల్ని నాశనం చేయాలి. దేశం బాగుపడాలంటే వెదికి వెదికి ఈలాంటి వ్యక్తుల్ని ధ్వంసం చేయాలి. అప్పుడే లంచగొండితనం పోతుంది. ఈ రెండు పద్ధతుల్ని అనుసరిస్తే తప్ప దేశం బాగుపడదు. [అంటూండగా భీమన్న ప్రవేశం]

భీమన్న : (టీ అందిస్తాడు]

రామా : [టీ త్రాగుతూ సిగరెట్ కూడ వెలిగిస్తాడు.]

ప్రెసి : (ప్రవేశిస్తూ) హలో రామారావుగారు, నమస్కారం నేను ప్రెసిడెంటుని మీకు తెలుసనుకొంటాను ఈపాటికి ఎం. ఎల్. ఏ. గారి ఫోన్ వచ్చే ఉంటుందనుకొంటాను.

రామా నమస్కారం రండి. ఫోన్ వచ్చినమాట వాస్తవమే.

ప్రెసి : మనపట్టణంలో 'విగ్రత్రీ' ముఖ్యులు రాజకీయంగా, పట్టణాభివృద్ధికి వాళ్ళెంతగానో సహాయంచేస్తూ ఉంటారు.

రామా ; అలాగా! అందుకని....

పెసి : అందుకని వాళ్లకే సహాయం మీ నుంచి కావలసిఉంది. సహకరించండి.

రామా : నేను వాళ్ళకు సహకరిస్తే ప్రభుత్వపు ఖజానాకు నష్టంవస్తుంది అలాంటి పనికి నేనంగీకరించను. అన్యాయం అంగీకరించలేను.

ప్రెసి ; కానీ మీ రనవసరంగా కష్టాల్ని....

రామా : తెచ్చుకొంటున్నానంటారా ? ఫరవాలేదండీ. ప్రభుత్వం నామీద ఎంతో బాధ్యతను పెట్టింది. నిర్వహించడం నావిధి నాధర్మం.

ప్రెసి : ఇవన్నీ మంచినీమాలే. జరగవలసినపని చూడండి. ఆ బిగ్‌త్రీ- కోమల సేఠ్‌జీ, కూర్మయ్య వస్తారు. వారిపని చేసిపెట్టండి. లేకపోతే ఫలితాలు సంతోషంగా ఉండవు.

రామా : ఏమీ ఫరవాలేదు. సిద్ధంగా ఉన్నాను.

ప్రెసి : ఎం. ఎల్. ఏ. గారు చెప్పారు. నేనుస్వయంగావచ్చి చెబుతున్నాను. వస్తాను.

రామా : సరే వెళ్ళరాండి. అపనిమాత్రం జరగడానికి వీల్లేదు. జరగదు. (కోపంతో) భీమన్నా!

భీమన్న : బాబుగారూ!

రామా : కోమల తక్కిన యిద్దరేగాదు ఫోన్, ఆ వెనుక ప్రెసిడెంటువచ్చి వెళ్ళారు.

భీమన్న : వాళ్ళంతే బాబుగోరూ! ఆళ్ల సేపు తిప్పుకొనేదాకే తరవాతంటారా ?

రామా : [గట్టిగా] అందేదాకకాళ్లు– అందాకజుట్టు- అంతేనా ?

భీమన్న : అంతే బాబుగోరు.

[అంటూండగా కోమల, సేఠ్‌జీ, కూర్మయ్య ప్రవేశిస్తారు- వాళ్ళచేతుల్లో లెదర్‌బాగ్స్ ఉంటాయి.] [భీమన్న ఖాళీగ్లాసుతో వెళ్ళిపోతాడు.]

కోమల : గుడ్‌ఆఫ్టర్‌నూన్ మిస్టర్‌రావ్ !

రామా : గుడ్‌ఆఫ్టర్‌నూన్. దయచేశారే ?

సేఠ్‌జీ : జీహాఁ ! మాట యిచ్చాము.

రామా : మాటేమిటి ?

కూర్మ : అదేఁ! మళ్లీ వస్తామన్నామ్ గదండీ! మీఇల్లు బంగారంగాను! అంతలోనే మరిచారే!

రామా : ఓహో అలాగా ?

కోమల : డొంకతిరుగుడు లేకుండా సూటిగా చెబుతున్నా మిస్టర్‌రావ్! మేం ముగ్గురం తలా ఇరపై వేలు చొప్పున యివ్వదలచు కొన్నాం.

రామా : ఛ! తమాషా ఆడుతున్నారా!

సేఠ్‌జీ : క్యాసాబ్ ! అది తక్కువంటార్ ! ఇంకా కావాలంటే ఇస్తాంసాబ్ ఫికర్ నై సాబ్ ఫికర్ నై

రామా : సేఠ్ జీ! అనవసరంగా మాట్లాడొద్దు మీరంతా ఇక్కడనుంచి వెంటనే దయ చేయండి. లేకపోతే బలప్రయోగం చేయవలసి ఉంటుంది, [భీమన్న ప్రవేశిస్తాడు]

కూర్మయ్య : అలా కోప్పడితే ఎలా బాబుగారూ! మేమేమీ తక్కువ ఇవ్వడం లేదుగా ? [నవ్వుతాడు]

రామా : [విసుగ్గా] ఛ ! ఛ!

కోమల ; రావుగారూ! ఇంతెందుకు? ఇదిగో నావాటా. [అంటూ నోట్లకట్టతీసి టేబిల్ మీద ఉంచుతారు]

రామా : [కోపంతో] ఛ! ఛ! ఏమిటీగొడవ ? ఇదేమన్నా ఆఫీసా లేక బందిలి దొడ్డా ? భీమన్నా !

భీమన్నా : బాబుగోరూ !

రామా ; పోలీసుల్ని పిలు. అప్పుడుగాని వీళ్ళతిక్క కుదరదు. పోలీస్! పోలీస్! [అని గట్టిగా అంటూండగా సబ్ ఇన్‌స్పెక్టర్ సదాశివబ్రహ్మం, కానిస్టేబిల్ కనకయ్య ప్రవేశం]

బ్రహ్మం
కనకయ్య [వచ్చి సెల్యూట్ చేస్తాడు]

బ్రహ్మం : వెరీసారీసార్ ! టేబిల్ మీదున్న నోట్లకట్టల్ని పట్టిచూస్తే మీరు లంచం పుచ్చుకొంటున్నట్టున్నారు. లా ప్రకారం మిమ్మల్ని అరెస్టు చేయవలసి ఉంటుంది.

రామా : ఇన్‌స్పెక్టర్! నే చెప్పేది వినండి.

బ్రహ్మం : వేరీసారీ ! మీరు చెప్పవలసిన పనిలేదు మేము వినవలసిన అవసరమూ లేదు. చెప్పేదేదో కోర్టులో చెప్పుకోండి. నంబర్ వన్ లెవెన్!

కనక ; ఎస్. సార్!

బ్రహ్మం ; అరెస్ట్ హిమ్!

కనక : ఎస్. సార్!

[పోబోతుండగా 'ఆగు' అన్నిమాటతో ఆశ్చర్యంతో ఆఫీసులోకి వెళ్ళే తలుపువైపు దృష్టికేంద్రీకరిస్తారు- శివం ప్రవేశిస్తాడు.]

కోమల : [తదేకంగా అతన్నే చూస్తూంటుంది.]

బ్రహ్మం : మీ రెవరు ?

శివం : [చిరునవ్వుతో] నేనా ? [అంటూ తన విజిటింగ్‌కార్డు ఇస్తాడు]

బ్రహ్మం :- [తీసుకొని పైకి చదువుతాడు]

ఆర్. ఆర్. శివం. సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్!

కోమల:— [తలదించుకొంటుంది.]

[పేర్‌జీ కూర్మయ్యలు వణికిపోతారు.]

రామా:- [ముఖం ప్రసన్నంగా మారిపోతుంది.]

శివం:- సబిన్‌స్పెక్టర్! రామారావుగారిని ఎందులకు అరెస్టు చేయబోతున్నారు ?

బ్రహ్మం:- డబ్బు తీసుకొంటున్నారుసార్! అందుకని....

శివం:- అదిచాలాతప్పు. ఏమీ తెలియకుండా ఒక నిరపరాధిని అరెస్టు చేయడం ప్రమాదం. మీ ఉద్యోగానికే ముప్పు.

బ్రహ్మం:- అయితే వారు నిరపరాధంటారా ?

శివం:- ఔను నిస్సందేహంగా !

బ్రహ్మం:- ఎలా చెప్పగలరు ?

శివం:- ఈ విషయం దర్యాప్తు చేయడానికే ఈవేళే ఈ ఊరొచ్చాను. రామారావు గారితో ఈ విషయాలే మాట్లాడాను. ఇక్కడున్న పిల్లు ఓనర్సు ముగ్గురిలో కోమల మా ఇద్దరికీ బాగాతెలుసు, కోమల, రామారావుగారు, నేను, ఎం. ఏ. లో క్లాసుమేట్స్.

కోమల:- [ముఖం వివర్ణమవుతుంది.]

వం:- బహుశా కోమల తనకున్న పూర్వపరిచయంతో రావుగారిని లొంగదీసుకో గలనని చెప్పియుండవచ్చు. అందుకే ఈ ముగ్గురుకలసి రామారావుగారిని బ్లాక్‌మెయిల్ చేశారు. ప్రత్యేకంగా కోమల తనకు ప్రేమున్నట్టు నటించి రామారావుగారిని వశవరచుకోవాలనుకొంది. కాని ఆయన లొంగలేదు. తమ ప్రయత్నం విఫలమైనందుకు రామారావుగారు లంచం పుచ్చుకొంటున్నారను

మిషతో మీ కప్పగింప దలచి ఈ పన్నాగం పన్నారు. కానీ వాళ్ళ ఎత్తుకు పైఎత్తు వేశాను. దీనికంతటికి నిదర్శనంగా ఉండేందుకు- కోమల, సేఠ్‌జీ, కూర్మయ్యలు- రామారావుగారిని బ్లాక్‌మెయిల్ చేసిన సంభాషణంతటిని తూ. చ. తప్పకుండా టేపురికార్డు చేశాను.

[అందరు ఆశ్చర్యపోతారు]

రామా :- [చాలా ప్రశాంతంగా ఉంటాడు]

బ్రహ్మం:- ఓహో అలాగా?

శివం:- వీళ్ళ ఆడిననాటకం ఇంతా అంతాకాదు. పాపం మా రామారావుగారిని నానా అవస్థలు పెట్టారు. ఈనాటికి వీళ్ళఆట కట్టింది. ఇప్పుడు చెప్పండి సబిన్‌స్పెక్టర్! ఎవరు అపరాధులు ?

బ్రహ్మం:- నంబర్ వన్ లెవెన్!

కనక:- ఎస్సార్.

బ్రహ్మం:- ఈ ఘరానా వ్యక్తుల్ని ముగ్గుర్ని అరెష్టుచెయ్!

శివం;- ఆగు. అంతేకాదు ఆ నోట్లకట్టలు పరిశీలించండి. మీ దగ్గర ఫేక్‌నోట్ల నంబర్లుంటే ఒకసారి సరి చూసుకోండి. అవంతా దొంగనోట్లు.

బ్రహ్మం:— అలాగ! [అంటూ నంబర్స్ సరి చూసుకొని] ఎస్; సార్! మీరు చెప్పింది కరెక్టు. వన్‌లెవెన్! అరెష్టుచెయ్ ఆల్‌వన్స్.

శివం:- వీళ్ళ ముగ్గురు సేల్స్‌టాక్సులు ఎగ్గొట్టేందుకు- వచ్చిన ఆఫీసర్లందరినీ నానా యమయాతనలు పెట్టడమే కాకుండా, దొంగనోట్ల బిజినెస్ గూడ పెట్టారు. ఇంతవరకు లంచం పుచ్చుకొనే ఆఫీసర్లని మాత్రం పట్టుకొన్నాను ఇప్పుడు లంచాన్ని ప్రోత్సహించే ప్రజల్ని- అందులోను దొంగనోట్లను తయారుచేసే మనుష్యుల్ని పట్టుకోగలిగాను. ఇన్‌స్పెక్టర్! ఆ నోట్లకట్టల్ని కష్టడీలోకి తీసుకోండి. వీళ్ళముగ్గుర్ని స్టేషన్‌కి తీసుకెళ్ళండి.

బ్రహ్మం:- ఎస్. సార్! [నోట్ల కట్టలు స్వాధీనం చేసుకొని]

యూ త్రీఆర్ అండర్ అరెస్ట్. కిమ్మనకుండా స్టేషన్‌కి వచ్చేయండి. మేము సెలవు తీసుకొంటాంసార్.

వం:- ఎస్. యూ కెన్ గో! బట్ బీకేర్‌ఫుల్ ఎబౌట్ దీస్ బిగ్‌త్రీ ! ! !

కనక:- నడవండి.

[బ్రహ్మం, అతనివెనుక కోమల, సేఠ్‌జీ, కూర్మయ్య, వారివెనుక కనకయ్య వెళ్ళిపోతారు.]

రామా:- చాలా థాంక్స్‌రా బ్రదర్! సరైన సమయంలో ఆదుకొన్నావ్. నీ మేలెప్పటికీ మరచిపోను.

శివం:- దానికేముందోయ్‌రావ్! దైవమను కూలించాలిగానీ మనం నిమిత్తమాత్రులం. కాని నీకు నేనుగూడ 'థాంక్స్' చెప్పకుండా ఉండలేను.

రామా:- ఆఁ దేనికి?

శివం:- వీళ్లు పట్టుపడేందుకు నీ సాయం ఎంతైనా అవసరంగదా? నీ సాయం లేకపోతే సాధ్యమయ్యేదికాదు.

రామా:- ఏమైతేనేం పీడవిరగడైంది. వెళదామా?

వం:- ఓ యస్.

రామా:- భీమన్నా!

భీమన్న:- బాబుగోరూ!

రామా;- నాటకం చూశావా?

భీమన్న;- టీ తెమ్మంటారా బాబుగోరూ?

శివం;- మీ జవాన్ చాలా మంచివాడే!

రామా;- వాడంతేలే! [గట్టిగా] కాదోయ్! వాళ్ళకు జరిగినశాస్తి చూశావా? [సైగ

భీమన్న:- ఓస్ అదా బాబుగోరూ! మా మంచిపని జరిగింది.

రామా:- [కోటువేసుకొని, హేట్ చేతిలోపుచ్చుకొని] శివం పోదాంపద! [అంటూ ఇద్దరూ వెళ్ళిపోతారు]

భీమన్న:- ఆళ్ళపాపం పండింది. తగిన శాస్తి జరిగింది. దేశంమంచికి యిలాటోళ్ళి సిచ్చించాలి. మరినేనూ ఎల్తా [ఏదో వినినట్లు నటించి] ఆఁ పిల్చారా బాబుగోరూ! వొస్తున్నా.

[అంటూ వెళుతుండగా—]

[తెర]

సమాప్తం

# ప్రగతి

పాత్రలు:-

సంప్రదాయరావు

స్వరాజ్యం, [సంప్రదాయరావు కూతురు]

చైతన్యం, [సంప్రదాయరావు కుమారుడు]

ప్రకాశం, [చైతన్యం స్నేహితుడు]

[తెర ఎత్తగానే గది— గదిలో నాలుగైదు కుర్చీలు, మధ్య 'టీపాయి' ఉంటాయి— గోడలు దేవతల ఫోటోలతో పాటు దేశనాయకుల ఫోటోల తోను అలంకరింపబడి ఉంటాయి....]

సంప్రదాయరావు:- [సుమారు 55, 60 ఏండ్ల మధ్య వయస్సు. సత్సంప్రదాయ సిద్ధమైన ఆకారం, వేషం- కుర్చీలో కూర్చుండి తెలుగుపత్రిక చదువుతూ ఉంటాడు-]

'జాతిమత విభేదాలు నశించాలి,— ప్రధానమంత్రి అభిభాషణ.... 'బీద ధనిక వివక్షతలేని సమత అవసరం'. ముఖ్యమంత్రి ఉవాచ.... ప్రణాళికల వలన దేశాభివృద్ధి ఇది చాలా అద్భుతమైన విషయం. ప్రణాళికల పేర్లు చెప్పి పెద్ద మనుష్యులు కొందరు దోస్తున్నారు దేశాన్ని. మరి కొందరు అధఃపతనం చెందుతున్నారు. ఎక్కడుందీ సమత ? దేశమేవిధంగా అభివృద్ధి చెందు తుంది ? ఇవన్నీ వట్టి బూటకాలు. చెప్పేదొకటి, చేసేదొకటి. అంతా కలి కాల మహిమ.... చైతన్యం! చైతన్యం! .... ఏం చేస్తున్నావురా నాయనా? ........ అమ్మాయ్ రాజ్యం! ........ రాజ్యం!..............................

స్వరాజ్యం:- [లోపల్నుంచి] అఁ ! వస్తున్నా నాన్నా!

సంప్ర:- అన్నయ్యేడమ్మా ?

స్వరా:- [ప్రవేశిస్తుంది- ఇరవై ఏళ్లుంటుంది వయస్సు- నవనాగరిక పద్ధతిలో తీర్చి దిద్దినట్లుంటుంది-]

ఏమిటినాన్నా! పిలిచావు?

సంప్ర:- చైతన్య మెక్కడకెళ్లాడమ్మా?

స్వరా:- అన్నయ్య పొద్దుటి నుంచి రాలేదునాన్నా!

సంప్ర:- ఇంతవరకు రాలేదా? వాడు, స్నేహితులు, పార్టీలు, సభలు, ఇవుంటే చాలు. హాయిగా పెళ్ళిచేసుకొని సుఖపడరా అంటే వింటాడూ?

స్వరా:- (గోముగా) నాన్నా!

సంప్ర:- ఏమ్మా!

స్వరా:- మరేం ! నేనలా వెళ్లొస్తా నాన్నా!

సంప్ర:- అలాగే ? సరే !

స్వరా:- మా నాన్న చాలా మంచివాడు [పోబోతూండగా]

సంప్ర:- అమ్మాయ్ ?

స్వరా:- ఏం నాన్నా ?

సంప్ర:- వాడంటే మగరాయుడు. తిరుగుతున్నాడు. నీవుగూడ అలా తిరగడం బాగా లేదమ్మా . పోకపోక ఓ యింటికి పోతే రాకరాక ఓ మాటొస్తుంది.... అదిగో చుక్క పెట్టుకోలేదే ?

స్వరా:- నాన్నా! మీవన్నీ పాతమాటలు, పాతపద్ధతులు. వస్తానాన్నా! టాటా! [వెళ్ళిపోతుంది]

సంప్ర:- ఏమిటో! ఓ ఆచారంలేదు. ఓ పద్ధతిలేదు. అనాటి సంప్రదాయం పాడై పోయింది. కాకి హంస నడక నడవబోయి తన నడకనే మరచినట్టైంది. కాలం. కలికాలం ? [అంటూండగా చైతన్యం ప్రవేశిస్తాడు.]

చైతన్యం:- [30 ఏళ్లవయస్సు- చాలా నాజూగ్గా ఉంటాడు- చిరునవ్వుతో....] నాన్నా!

సంప్ర:- ఆఁ ! ఏం నాన్నా!

చైత:- ప్ర. ప్ర.కు ఘనసన్మానం జరిగింది నాన్నా!

సంప్ర:- ప్ర, ప్ర.కు ఏమిట్రా?

చైత:- వాడే నాన్నా! నా స్నేహితుడు ప్రకాశం. ఈరోజు ప్రకాశానికి ఒక బిరుదు కూడా ఇచ్చారు. ప్రకాశం ప్రణాళికల కోసం తన సర్వస్వాన్ని త్యాగం చేసి దేశాభివృద్ధికి దోహదం చేశాడు. అందుకని మా యువజనసంఘం అతనికి సన్మానం చేసింది. ప్రణాళికా ప్రకాశం అని పేరుపెట్టి రెండు ప్రాలు తీసుకొని 'ప్ర. ప్ర.' అని పొట్టి పేరుంచాము. బాగుందానాన్నా ?

సంప్ర:- ఏమో అబ్బాయ్ ! ఆ బాగోగులు నాకుతెలియవు. ఏం ప్రణాళికలో ? ఏం బిరుదులో ? ఏం సంఘాలో నాకు బొత్తిగా బోధపడదు. మా కాలంలో ఇవ్వన్నీ ఏమీలేవు. అయినా మా తరం వారంతా సుఖంగానే బ్రతికారుగా ?

చైత:- ఆసుఖానికీ ఈసుఖానికీ చాలా తేడా ఉందినాన్నా! వ్యవసాయ రంగం లోను, విద్యావిషయికంగాను, సాంఘికంగాను, పారిశ్రామికంగాను, దేశ మెంతో అభివద్ధి చెందింది. పంచవర్ష ప్రణాళికలు ప్రవేశపెట్టిన తరువాతనే మనకు అసలు స్వాతంత్ర్యం అంటే ఆర్థిక స్వాతంత్ర్యం కలిగిందని చెప్ప వచ్చును.

సంప్ర:- కాని ప్రణాళికలు, దేశాభివృద్ధి- వీటిని గురించి ప్రతి పత్రిక ఘోషిస్తుం టుంది. ఆకాశవాణి భాషిస్తుంటుంది. ఎవరు మాట్లాడినా ఇవే విషయాలు- పత్రికల్లో ఉన్నవన్నీ నిజమేనని నమ్ముతారు అమాయక ప్రజలు. అభివృద్ధి దేవుడెరుగు. అభివృద్ధికి బదులు వినాశం జరుగుతూందనుకోవచ్చు.

చైత:- నాన్నా! మీవన్నీ పాత పద్ధతులే? అభివృద్ధి చెందుతూంటే చూసి సంతో షించక, ఇవేం మాటలునాన్నా ఇలాంటి మనుషులుండబట్టే దేశ మీ విధంగా ఉంది. అభివృద్ధి నిరోధకశక్తులు నశించి పోతే దేశం అభివృద్ధి చెందుతుంది. మీ రనుకొనే కాలానికి దీనికి చాలా వ్యత్యాసం.

సంప్ర:- నిజమే చాలా భేదముంది.

చైత:- స్వాతంత్ర్యం రాక పూర్వం భారతదేశం నానా హింసలకు లోనైంది. స్వాతంత్ర్యం వచ్చాక ప్రణాళికలు ప్రవేశపెట్టిన తరువాత ఆనంద సముద్రంలో దేశం మునిగితేలుతూంది. ఇదంతా కూడా ఆర్థిక స్వాతంత్రం వచ్చాకనే జరిగింది.

సంప్ర:- ఎక్కడుంది ఆర్థిక స్వాతంత్ర్యం ? ధనవంతులు ఇంకా ధనవంతు లౌతున్నారు, పేదలు నిరుపేదలౌతున్నారు. ఏదీ ఒక ఉదాహరణ ?

చైత:- ఒక్క టేమిటి ? కోకొల్లలు. మొదటి ప్రణాళికా కాలంలో వ్యవసాయ రంగంలో జమిందారీ పద్ధతి మాన్పించడం జరిగింది.

సంప్ర:- దాని వల్ల కలిగిన లాభమేమిటి ?

చైత:- జమిందారీ పద్ధతిని రూపుమాపడంవల్లనే బీద ప్రజానీకం మనుగడ సులభమైంది. తరువాత సమిష్టివ్యవసాయంగూడ మనదేశంలో ప్రవేశ పెట్టడానికి వీలైంది.

సంప్ర:- అంతకు పూర్వము ప్రజలు జీవించలేదా ?

చైత:- జీవించారు. కానీ స్వేచ్ఛారహితమైన జీవితంగూడ ఒక జీవితమేనా నాన్నా?
[అంటూండగా ప్రకాశం ప్రవేశిస్తాడు]

ప్రకాశం;- [చైతన్యంతో సమవయస్కుడు- పుష్టిగల విగ్రహం- రాజకీయ నాయకునిలా ఉంటాడు- వస్తూ....] నమస్కారమండీ రావుగారూ!

సంప్ర:- ఎవరూ ?

చైత:- వీడేనాన్నా ప్రకాశం!

సంప్ర:- అఁ ! రావయ్యా ! ఇలా కూర్చో.
ప్రకా:- [కుర్చీలో కూర్చుంటాడు]

చైత:- అప్పుడే వచ్చేశావే ? ఏమిటి సంగతి ?

ప్రకా:- ఏమీలేదు. 'బీ. డీ. వో.' ను కలుసుకోవాలనుకొన్నాను. ఇంకా కొద్దిగా వ్యవధి ఉంటే ఇలా వచ్చాను.

చైత:- ఓహో అదా! (తండ్రితో) నాన్నా! ఈనాటి సన్మానసభలో మంత్రిగారు తెగ పొగిడారుప్రకాశాన్ని. స్వార్ధత్యాగం, ప్రణాళికలగూర్చి మామూలు ప్రజలకు బోధపడేటట్టు ప్రకాశం ఇచ్చిన లెక్చర్లు, దేశాభివృద్ధికి పాటుపడిన విధానం, అందుకు కావలసిన కృషి- వీటిమీద చాలా పెద్దఎత్తున ప్రశంసిస్తూ మాట్లాడారుమంత్రిగారు. అవన్నీ తల్చుకొంటూంటే చాలా సంతోషం కలుగుతుంది.

సం|ప్ర:- అహా! అలాగా! గొప్పవాడివైనాయావ్ ప్రకాశం! చాలా సంతోషం.

ప్రకా:- ఏదో మీ లాంటి పెద్దల ఆశీర్వాదం! నిజానికి నేను చేసిందేమీలేదు. ఒక మానవునిలాగ నా విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చాను. మనచైతన్యం తన స్నేహితులతోకలసి నా కిష్టంలేకపోయినా నాకీ సన్మానం చేయించాడు.

సం|ప్ర:- చాలా బాగుంది. మంచిపనే.

చైత:- ప్రకాశం! నీవేమైనాచెప్పు. ఆ సన్మానానికి తగినవ్యక్తివోయ్!

ప్రకా:- ఏమో! నేనలా వెళ్ళొస్తాను. ఎక్కడికీ వెళ్ళకు. వస్తానండీ రావుగారు.

సం|ప్ర:- సరే మంచిది.

ప్రకా:- (వెళ్ళిపోతాడు)

చైత:- ప్రకాశమంటే మీ అభిప్రాయమేమిటినాన్నా ?

సం|ప్ర:- ప్రకాశానికేం ? మంచివాడులా ఉన్నాడు. కీర్తిప్రతిష్ఠలున్న వాడని నీవు చెప్పావుగదా ?

చైత:- అదికాదునాన్నా.

సం|ప్ర :- ఏదికాదురా ?

చైత:- చెల్లాయ్ పెళ్ళివిషయం

సం|ప్ర :- ఓహో! దానికేం. చేద్దాం! తగినవరుడు దొరకనీ!

చైత :- ప్రకాశం తగడంటారా ?

సం|ప్ర:- ప్రకాశమా ? స్వరాజ్యాన్ని ప్రకాశానికిచ్చి పెళ్ళి చేయాలంటావా ?

చైత:- ఔన్నాన్నా! ఇంతకుముందే ఈ విషయం మీకు చెప్పాను. మరచిపోయా రప్పుడే !

సం|ప్ర:- ఆఁ: ఔనౌను. చెప్పావు.

చైత:- మరి ఏమంటారు ?

సం|ప్ర:- కానీ చూద్దాం !

చైత:- చూద్దామంటే కాదునాన్నా! ప్రకాశం స్వరాజ్యానికి అన్ని విధాలా తగిన వరుడు. ప్రకాశమంటే చెల్లికి గూడ చాల అభిమానం! మరి మీరుఊఁ అంటే చాలు !

సం|ప్ర:- అబ్బాయ్! కీర్తి ప్రతిష్ఠలుంటేచాలవోరయ్! జీవితభారం మోసేందుకు స్తోమతగూడ అవసరం !

చైత:- కుటుంబాన్ని, పోషించగలదునాన్నా! అందులో ఏమాత్రం సందేహం లేదు.

సంప్ర:- ఉన్న స్థిరాస్తులన్నీ నాశనం చేస్తుకొన్నాడు. ప్రజా సంక్షేమం కోసమనీ, ప్రణాళికలద్వారా దేశాభివృద్ధి అంటూ ఉన్న డబ్బువదలించుకొన్నాడు.

చైత:- డబ్బుపోతే మాత్రమేమి నాన్నా? దేశంకోసం, తన ప్రజలకోసం స్వార్థ త్యాగం చేసాడు. అగుణానికి హర్షించక తెగడుతున్నారే ? ఇంతెందుకు ? మన విషయమే తీసుకోండి!

సంప్ర:- మనకేం ? మన కుటుంబం బాగా బ్రతికిందోయ్ !

చైత:- ఒకానాడు బాగానే ఉండవచ్చు. తరువాత మీరు పూర్వపద్ధతుల్ని ఆధారం చేసుకొని మడిగట్టుక కూర్చున్నారు. కాలంతోపాటు వచ్చే అభివృద్ధిని మీరు నిరాకరించారు. అందువల్లనే ఇల్లుగుల్లయింది. ఈ ప్రణాళికల మూలంగా దేశం బాగు పడుతూంది. సులభంగా వంతులవారీగా తీర్చే పద్ధతిమీద ప్రజలకు అప్పులనిస్తూంది ప్రభుత్వం. ఆ పద్ధతివల్లనే మనం బాగుపడ్డాం.

సంప్ర:- ఆఁ! ఏంబాగో ? ప్రభుత్వం ఋణం తీర్చొద్దా ?

చైత:- తీర్చాల్సిందే! కాని చాలా సులభంగా పోతుంది. అంతమొత్తం ఏ ధనవంతుని వద్దయినా తీసుకొన్నట్టయితే ఉన్న ఆస్తిపాస్తులకు తిలోదకాలువదలాల్సి ఉండేది. ప్రభుత్వం అప్పిచ్చింది గనుకనే మన బంజరుభూములన్నీ ఆ మాత్రం సాగులోకొచ్చాయి. దాని మీద ఎంతలేదన్నా సంవత్సరాదాయం కొన్నివేలలోనే ఉందిగదా ?

సంప్ర:- అబ్బాయ్ ! పెద్దవాడయ్యావు! తెలివిగలవాడవి.నీతో వాదించలేనోయ్.

చైత:- అదికాదు నాన్నా! కొంచెం ఆలోచించండి! ప్రభుత్వం గృహనిర్మాణానికి గూడడబ్బు అప్పుగా ఇవ్వడం వల్ల నేగదా మనమీమాత్రం ఇంట్లో ఉండేందుకు అవకాశం దొరికింది ? లేకపోతే సాధ్యమా ?

సంప్ర:- కొంతవరకు నిజమేనోయ్ ! కాని అంతా మంచిదంటే మాత్రం నేనొప్పుకోను.

చైత:- ఇంతేకాదు వైద్యవిషయం తీసుకోండి. ఏ రోగమైనాసరే ఇట్టేనయమయ్యేట్టు నానా రకాలమందులు కనిపెట్టారు. గుండెతీసి గుండెమార్చగలుగుతున్నారు. మీ కాలంలో ఈ సదుపాయాలుండేవేనా ?

సంప్ర:- అబ్బాయ్ ! విజ్ఞానం పెరిగేకొలదీ కష్టాలుగూడ ఎక్కువౌతాయి. ఎన్ని రకాల మందులు కనిపెట్టినా కొత్తరోగాల సంఖ్యగూడ నానాటికి పెరుగుతూంది. దీనిమాటేమంటావ్ ?

చైత:- ఇంక విద్యావిషయంలోగూడ మనదేశం బాగా పురోగమించిందని చెప్పవచ్చు. ప్రతిపల్లెలోను ఒకబడి; ఉచితవిద్య- ఇవన్నీ పంచాయతీ రాజ్యం ఏర్పడిన తరువాత కలిగిన లాభాలేకదా? రోడ్డురవాణా సౌకర్యాలు అధికంకావడం, ఆహారసమస్య తొలగిపోవడం- ఎన్నో మంచిపనులు జరిగాయి. ఇవన్నీగూడ పూర్వం ఉండేవేనా ? వీటినిచూస్తూ అనుభవిస్తూ గూడ తెలీనట్లు మాట్లాడుతారేమినాన్నా ?

సంప్ర:- పంచాయతీరాజ్యం.... ఏమోఅబ్బాయ్ ! ఇదంతా పంచాయితయింది ! సరే నీతో వాదించలేనని చెప్పానుగా ?

చైత:- పాతవన్నీ మంచివని పట్టుపట్టకూడదు నాన్నా!

సంప్ర:- అదేవిధంగా కొత్తవన్నీ మంచివని మనమనుకోరాదోయ్ ?

చైత:- లేదు ఇప్పటి పద్ధతులన్నీ కొత్తపాతల మేలుకలయిక.

సంప్ర:- ఇప్పటికి నీతో అంగీకరిస్తున్నానబ్బాయ్ ! అయితే నేటి ప్రభుత్వ విధానం? ప్రజాళికా ప్రవేశం మొదలైనవన్నీ చాలా ఉత్తమమైనవనడంలో సందేహం లేదన్నమాట తెలిసిపోయింది. కానీ ప్రభుత్వాన్ని నడుపుతున్న వ్యక్తులలో ఏ కొందరో సత్యసంధులై నడుచుకొనేవాళ్ళు ? అందరు స్వార్థత్యాగులై నప్పుడుగదా దేశం బాగుపడుతుంది ?

చైత:- నిజమే ! మన ప్రకాశం లాంటివాళ్ళ ఏ కొద్దిమందో ఉంటారు. నిష్కామ కర్మ చేసేవాళ్లు. ఆఁ నాన్నా ! అన్నట్టు ! మన స్వరాజ్యం పెళ్ళివిషయం

(అంటూండగా స్వరాజ్యం ప్రవేసిస్తుంది.)

స్వరా:- ఏమిటన్నయ్యా !

చైత:- ఆఁ ! ఏమిలేదు నీ పెళ్ళిసంగతే !

స్వరా:- [సిగ్గుతో] పో అన్నయ్యా ! [అంటూలోనికి పోతూండగా]

సంప్ర:- నిజమేనమ్మా ! నీ అన్నయ్య నీకు పెళ్ళిచేస్తాట్ట.

చైత:- ఏమైననారే ! ప్రకాశానికిచ్చి పెళ్ళి చేయాల్సిందే నాన్నా !

సంప్ర:- అదేమిటోయ్ ! మొండిపట్టుదల ? ఆస్తిపాస్తులులేనివాడు ప్రకాశం. అల్లారుముద్దుగా నా చిట్టితల్లిని పెంచాను. తల్లి లేనిలోటు తీర్చాను. అలాంటి నా చిట్టిని ప్రకాశానికిచ్చి ఎలా పెళ్ళి చేయమంటావ్ ?

చైత:- డబ్బులేక పోతేనేమి నాన్నా! ప్రకాశానికి చాలా గౌరవముంది సంఘంలో ! ఇంక మనిషంటావా ? ప్రకాశం దేవునిలాంటివాడు. నేనుండగా చెల్లాయి కేమీలోటు రానీను. నమ్మునాన్నా !

సంప్ర:- సరే నీ యిష్టమబ్బాయ్ ! [స్వరాజ్యాన్నుద్దేశించి] అమ్మాయ్ రాజ్యం!

స్వరా:- ఏమిటినాన్నా ?

సంప్ర:- అన్నయ్య చెప్పినవన్నీ విన్నావా అమ్మా ?

స్వరా:- [సిగ్గుతో మౌనంగా ఉంటుంది]

చైత:- చెల్లాయినల్లా అడిగితే ఏమంటుందినాన్నా ? సందేహమే అక్కర్లేదు. ఆ బాధ్యత నా కుండనీ ! ఏం చెల్లాయ్ ?

స్వరా:- పో అన్నయ్యా !

చైత:- ఆఁ ! అంతా నాకు తెలుసులే [అంటుండగా ప్రకాశం ప్రవేశిస్తాడు]

ప్రకా:- ఏమిటోయ్ నీకు తెలిసింది?

స్వరా:- ఏమీలేదు. మా చెల్లెలు పెళ్ళివిషయం !

ప్రకా:- నిజమా ? వరుడెవరు ?

చైత:- చాలా గొప్పవాడు!

ప్రకా:- ఎవరబ్బా ?

చైత:- చెప్పనా ?

ప్రకా:- చెప్పమనేగా అడుగుతున్నాను ?

చైత:- బహుమాన మేమిస్తావ్?

ప్రకా:- ఆఁ ! దీనికిగూడ బహుమానమా చెప్పవోయ్ !

చైత:- ఇక్కడే ఉన్నాడు.

ప్రకా:- ఎక్కడా [అంతాకలయజూస్తాడు]

చైత:- ఎక్కడ కాదోయ్ !

ప్రకా:- మరెక్కడా ?

చైత:- ఇక్కడే? [అంటూ ప్రకాశాన్ని చూపిస్తాడు]

ప్రకా:- [ఆశ్చర్య సంతోషాలతో] ఆ! నేనే ? అంత అదృష్టమా ? [తమాయించుకొని] అయినా, చైతన్యం! నీకు నామీదున్న అభిమానంకొద్దీ అంటున్నావ్. కాని.... నాకు ఇల్లా? వాకిలా? ఆస్తా? ఏమున్నాయనీ? మరి బాగా ఆలోచించండి.

చైత:- బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాం ప్రకాశం. మా మాట కాదనకు.

సంప్ర:- అబ్బాయ్ ప్రకాశం! అన్నా చెల్లి ముచ్చటపడుతున్నారు. కాదనకు నాయనా?

ప్రకా:- అదిగాదండీ........ !

చైత:- ఏదికాదు? మాకు కొంత ఆస్తి ఉండనేఉంది. చెల్లాయిని నా తమ్ముడిగా చూసుకొంటాను. నమ్ము!

సంప్ర:- నిజమే ప్రకాశం పెళ్ళయ్యాక మాతోపాటే ఉండిపో. అమ్మాయిగూడ సన్నిహితాయకుండా ఉంటుంది.

చైత:- ఔను ప్రకాశం నేనుచెప్పాల్సినమాటలు నాన్నే చెప్పారు. మనమందరం కలిసే ఉందాం. అంతకంటే సంతోషమేముంటుందా?

ప్రకా:- సరే మీరంతగా చెప్పుతున్నారుగనుక కాదనలేకపోతున్నాను. [అంటూ స్వరాజ్యంపైపు చూస్తాడు.]

స్వరా:- [సిగ్గుతో లోనికి వెళ్ళిపోతుంది]

సంప్ర:- అబ్బాయ్ చైతన్యం! నాకు చాలా సంతోషంగాఉంది. నీవు నిజంగానే చైతన్యుతవు! నాకుగూడ కనువిప్పుకలిగించి వెలుగుబాట చూపించావ్! కాలంతోపాటు మనుషులు గూడా మారాల్సిఉంటుంది. వచ్చేముహూర్తాల్లో పెళ్ళి.

సంప్రదాయంకూతురు స్వరాజ్యం. స్వరాజ్యాన్ని ప్రజాశక్తి ప్రకాశానికిచ్చి పెళ్ళి చేయాలన్నమాట! చాలా బాగుంది. ఇంతేకాదు ప్రకాశం! మీకు పుట్టబోయేబిడ్డకు నామకరణంగూడచేస్తున్నా. ఏమిటోతెలుసా? ప్రగతి.

బాగుందా? [అంటూ నవ్వుతూ వెంటనే] ఓహో! మరిచాను నీవు ప్ర. ప్ర అంటే ప్రణాళికా ప్రకాశంగదా? పెళ్ళివెంటనే సంతానం కోరుతున్నాను. తప్పయింది. నీకు కుటుంబనియంత్రణ అడ్డొస్తుందికాబోలు! ప్రజల సుఖ సంతోషాలకు పరిమిత కుటుంబమేగాక వివాహానంతరం సంతానం పొంద డానికిగూడ వ్యవధిచాలా అవసరం. ఏమంటావు ప్రకాశం?

ప్రకా: నేను చెప్పాల్సిందేముంది మామగారూ! [అంటూ చైతన్యంవైపుచూస్తూ] చైతన్యం! ఓ! తప్పు, తప్పు చైతన్యంబావా! నీ మూలంగా మామగారూ, ప్రణాళికా ప్రగతివల్ల దేశాభివృద్ధి సాధించే పద్ధతిని మనకంటే బాగా తెలుసు కొన్నారు. [అంటూ నవ్వుతుండగా]

చైత: నిజమే బావా! అదంతా మనఅదృష్టం. [చిరునవ్వులు చిందిస్తూంటాడు.]

సంప్ర: సంతోషంగాఉంది. పనుంది. నేనలా బయటికివెళ్ళొస్తా. [అంటూ సంప్రదాయరావు నిష్క్రమిస్తాడు]

ప్రకా: [సంతోషంతో] చైతన్యం [అంటూ చైతన్యంతో కరచాలనం చేస్తూండగా, స్వరాజ్యం ఆనందంతో చూస్తూండగా........]

తెర పడుతుంది

# పునర్యౌవనం

పాత్రలు:-

డాక్టర్ సదానందం,

రామనాథం,

కర్నల్ N.కంఠం

రంగారావు,

మధురిమ.

[తెరయెత్తగానే— ఒకగది, చీకటితోను, సాలెగూళ్లతోను, దుమ్ముతోను, నిండి ఉంటుంది. గోడలనానుకొని పలువిధాల పుస్తకాల బీరువాలుంటాయి. మధ్య బీరువామీద ఒక పురుషుని కంచువిగ్రహముంటుంది. చీకటి మూల్లో పొడవుగా సన్నగా ఉండి అర్ధవివృతమైన చెక్కఅర ఉంటుంది— అందులో అస్థిపంజర ముంటుంది. రెండు బీరువాలకు మధ్యన కాంతివిహీనమైన గిల్టుఫ్రేమ్‌లో దుమ్ముతో నిండిన అద్దముంటుంది. గదిముందు ఒకనవయువతి పూర్తి [Life size] చిత్ర ముంటుంది—

గది మధ్యన నల్లటి రౌడ్‌టేబిల్- చుట్టూ ఐదారుకుర్చీలు- టేబిల్‌మీద మిక్కిలి నేర్పుతోను, అందంగాను తయారుచేయబడిన గాజుపాత్ర ఉంటుంది- పాత్రలో ఒక రకమైన ద్రవముంటుంది. పాత్ర మూయబడిఉంచ• కిటికీ గుండావచ్చే సూర్యరశ్మి మాసిన రెండుతెల్లటి డెమాస్కస్ తెరల మధ్యనుండి వచ్చి సరిగా ఆ పాత్రకడ్డంగా పడుతూంటుంది. ఆపాత్రనుంచి ప్రతిబింబిస్తున్న ఆకాంతి రౌండ్ టేబిల్‌చుట్టూ కూర్చున్న వ్యక్తుల ముఖాలమీద పడుతూంటుంది- టేబిల్‌మీద నాలుగు షాంపేన్ [Chanpagne] గ్లాసులుగూడ ఉంటాయి.

సమయం:— వేసవికాలము పగలుసుమారు నాలుగైదు గంటలు]

డాక్టర్ సదానందం:- [అరవై పైబడిఉంటుంది వయస్సు- బట్టతల- ఫుల్‌సూట్ మాసినగుడ్డలు, గడ్డం, ఆయన ముఖంలో నిర్వేదం, ఆత్మానందాలు

ప్రస్ఫుటిస్తూంటాయి. ఆర్మ్ చైర్‌లో కూర్చుండి ఉంటాడు- తలుపుతట్టిన శబ్దంవిని 'ఎస్, ఎస్, కమింగ్'- అంటూ లేచిపోయి తలుపు తీస్తాడు.]

[తలుపుతీయగానే ముగ్గురుపురుషులు, ఒకస్త్రీ ప్రవేశిస్తారు- పురుషులు దాదాపు డాక్టరుతో సమవయస్కులు.]

డాక్టర్:- [వాళ్లనిచూసి] గుడ్‌మార్నింగ్ ఫ్రెండ్స్ !

అతిధులు:- వెరీ గుడ్‌మార్నింగ్ డాక్టర్ ?

డాక్టర్:- [కుర్చీదగ్గరికిపోయి] రామనాథం! ఇటుకూర్చో [అనికుర్చీచూపిస్తాడు]

రామనాథం:- థ్యాంక్యూడాక్టర్! [అంటూ డాక్టర్‌కి ఎడమప్రక్క కుర్చీలో కూర్చుంటాడు,- వేషాన్ని ఆకారాన్నిబట్టి చూస్తూనే వ్యాపారని తెలుసుకో వచ్చు.]

కర్నల్ N. కంఠం:- [కర్నల్ నీలకంఠం- తెల్లబడినమీసాలు- సోల్జర్ డ్రెస్సులో ఉంటాడు] థ్యాంక్యూడాక్టర్!

[అంటూ రామనాథం ప్రక్కన కూర్చుంటాడు]

డాక్టర్:- రంగారావ్! నీవు- మధురిమా నీవిక్కడ? [అంటూ కుర్చీలుచూపిస్తాడు.]

రంగారావు:- [ఇద్దరు గుడ్డలు- కళ్ళజోడుంటుంది. రాజకీయవేత్తఅని స్పష్టంగా తెలుస్తూంది. కర్నల్‌ప్రక్కన కూర్చుంటాడు.]

మధురిమ: [తెల్ల టచీర, తెల్ల టజాకెట్టు వేసుకొనిఉంటుంది. ఇంతకుముందు అందంగా ఉండేదని, పూర్వసువాసిని అని ఆమె ఆకారంవల్ల స్పష్టంగా తెలుస్తూంటుంది.] థాంక్యూడాక్టర్ [అంటూ రంగారావుప్రక్క కూర్చుంటుంది.]

డాక్టర్: [కుర్చీలో కూర్చుండి] మైడియర్ ఓల్డ్‌ఫ్రెండ్స్! నేనెందులో అయితే ఆత్మానందాన్ని పొందగలనో ఆ పరిశోధనల్లో ఒకదానిని మాత్రం గమనించ వలసిందిగా మీ సాయాన్ని అర్థిస్తున్నాను. [కంచు విగ్రహాన్ని చూపుతూ] ఆ కంచు విగ్రహాన్ని చూశారూ! ఆయన మహామేధావి; డాక్టర్ జయరాం. నా ప్రాక్టీస్‌లో కష్టమని తోచినప్పుల్లా అతనితో తన్స్టుచేసే

వాణ్ణి. అతడు పోయింతర్వాత ఆతని విగ్రహాన్ని ఈ గదిలో ఉంచకుండా ఉండలేకపోయాను కానీ అదిఅట్లా ఉండనీ. మైడియర్ ఓల్డుఫ్రెండ్స్! మీ అందరి సాయంతో మిక్కిలి అపురూపమైన పరిశోధన చేయాలని ఎంచుతున్నాను. మీ కిష్టమేగదా?

రామ: [ఎగతాళిగా] ఏల్ వంపుతో ఎలుకను చంపటమా డాక్టర్?

కర్నల్: లేక సాలెపురుగుని మైక్రోస్కోప్‌లోపెట్టి పరీక్షించటమా?

రంగా: ఏదో సంథింగ్ అలాంటిదై ఉంటుంది.

మధు: [నవ్వుతూ] ఎస్. ఎస్.

డాక్టర్: [కాదన్నట్లు తలూపుతూ] మీ రనుకొన్న దేదీకాదు. ఆగండి. ఇప్పుడేవస్తాను. [పుస్తకాల బీరువావైపు వెళ్ళి, నల్లటిచర్మం అట్టలపెద్దపుస్తకంతో తిరిగివచ్చి] పరిశోధనలో దిగేముందు ఈ పుస్తకాన్ని గురించి మీకు కొంత చెప్పదలచాను. దీనిమీద ఏలాంటి అక్షరాలులేవు. కాని చూసిన తక్షణం మేజిక్‌బుక్ [Magic book] అని మాత్రం తెలుస్తూందిగదూ?

రామ
రంగా } ఎస్, డాక్టర్, ఎస్.
మధు
కర్నల్

డాక్టర్: ఒకప్పుడు దుమ్ము దులిపివేయడానికని పనిపిల్ల ఈ పుస్తకాన్ని తీయబోయింది. ఒక్కసారిగా ఏం జరిగిందోతెలుసా? అరలోని అస్థిపంజరము పట పటమని శబ్దంచేసింది. ఆ నవయువతి చిత్రం ఒక అడుగుముందుకు నడచి వచ్చింది. ఆ అద్దంలోంచి నానా వికారాలు తొంగిచూచినయ్. డాక్టర్. జయరాం కంచు విగ్రహం భ్రుకుటి చిట్లించి 'ఫార్‌బేర్' అని హెచ్చరించింది. ఇదే ఈ 'మేజిక్‌బుక్' విశేషం.

రామ: [భయంతో] బాబోయ్! అయితే దాన్ని తెరవకండి.

రంగా: ఔనంతే.

కర్నల్: ఏమైనాసరే! దాన్ని పరీక్షించాల్సిందే. వాట్ డాక్టర్?

డాక్టర్: ఎస్. తప్పకుండా. ఇది మీరనుకొన్నంతగా ప్రమాదకరమైందికాదు.

[ఆ పుస్తకం పుటల మధ్యనుంచి వాడి వత్తయిపోయిన ఒకరోజా పుష్పాన్ని తీసుకొని, నిట్టూర్పుతో] ఈ రోజాపుష్పాన్ని చూశారా? [అతిథులు తదేకంగా చూస్తూంటారు] ఇది సరిగా యాభై ఐదేళ్ళక్రితం వికసించింది. కాని యిప్పుడు వాడిపోయి పొడిపొడిగా రాలిపోతూంది. ఎదురుగాఉన్న ఆ యువతి చిత్రాన్ని చూశారా? అదొక పెద్దగాథ. అదే నా ప్రేమగాథ. [వేడి కన్నీటిబొట్లురాల్తాయి] ఆమెపేరు శోభాదేవి. మేమిద్దరం మనసారా ప్రేమించుకొన్నాం. ఈ పుష్పాన్ని ప్రేమచిహ్నంగా శోభ నాకప్పుడిచ్చింది. మా పెళ్ళినాడు నేనుదీన్ని నా రొమ్ముమీద అలంకరించు కోవాలనుకొన్నాను. కాని కాలం కర్మం కలసిరాలేదు. పెళ్ళినాటి సాయంత్రం, ఒకానొక స్వల్ప అస్వస్థతవల్ల బాధపడి బా పేషంట్స్ ఎవరికో ప్రిస్క్రైబ్‌చేసిన మందు సేవించి నా ప్రియమైన శోభ- ఈలోకం వదలిపోయింది. అప్పటి నుంచి ఇప్పటిదాకా ఈపుష్పాన్ని ఈపాతపుస్తకంలో భద్రంగా దాచిఉంచాను ఈపుష్పం మళ్లీ ఎప్పుడైనా వికసించగలదని మీరు కలలోనైనా ఊహించ గలరా?

మధు: [వెడనవ్వుతో] నాన్సెన్స్. ఇంకానయం. ముడుతలుపడ్డ వృద్ధురాలి ముఖం మళ్ళీ ఎప్పుడైనా వికసించగలదా అని అడగలేకపోయారా డాక్టర్ ?

డాక్టర్: సీ. హియర్! [అంటూ టేబిల్‌మీదున్న గాజుపాత్ర మూతతీసి అందులోని ద్రవంలో వాడిపోయిన రోజానివేస్తాడు]

[అందరూ గాజుపాత్రలోని రోజాని పరిశీలిస్తూంటారు]

మధు: [హేళనగా] నిజమే, తేమనేమాత్రం పీల్చలేదుగాని ద్రవంమీద మాత్రం తేలాడుతూం దీరోజా పుష్పం.

రామ: నో. నో. అందులో మార్పుకనిపిస్తూనే ఉందే?

కర్నల్: ఎస్. దటీస్‌రైట్. వాడివత్తయిపోయిన ఈరోజా దళాలులేత ఎరుపుదనాన్ని పొందుతున్నాయి. స్వల్పనిద్ర అనే మరణం నుంచి మళ్లీ బ్రతుకుతుందా అన్నట్లు మారుతుందీ పుష్పం.

రంగా: సన్నసైన దీనితోడిమగూడ ఆకుపచ్చగా మారుతూంది.

డాక్టర్: ఎస్. దీసీస్ దిరోజ్ అవ్‌హాఫ్ఏ సెంచరీ. నా శోభ ఇచ్చినప్పుడు ఎంత ఫ్రెష్‌గాఉందో ఇప్పుడుగూడ ఈరోజా అంతఫ్రెష్‌గా ఉంది.

మధు: ఎస్. [కేర్లెస్‌గా] నిస్సందేహంగా ఇదేకో ముచ్చటైన 'డిసెప్షన్' లాగుంది. ఇదెట్లా జరిగిందో దయచేసి చెప్పగలరా డాక్టర్?

డాక్టర్: 'ఫౌంటెయిన్ ఆఫ్ యూత్'ని గురించి మీ రెప్పుడైనా విన్నారా? అదొక విచిత్రమైనద్రవం. రెండు మూడు శతాబ్దాల క్రితం 'పోన్స్‌డిలియన్' అనే స్పెయిన్ సాహసి దీన్ని అన్వేషిస్తూ వెళ్ళాడు.

మధు: మరి 'పోన్స్‌డిలియన్'. దీనివిషయమేమైనా కనుగొన్నాడా డాక్టర్?

డాక్టర్: నో. ఆయనెప్పుడు సరైన స్థలంలో అన్వేషణ చేయలేదు .నేను తెలుసుకొన్నంతవరకు నిజమే అయితే "ఫ్లారిడా ద్వీపకల్పం దక్షిణభాగంలో 'మెకాకో' సరస్సుకు దగ్గరలోనే ఉంటుంది. ఆ ఫేమస్ ఫౌంటెయిన్ ఆఫ్ యూత్. దాని ఉత్పత్తిస్థానం అనేక బ్రహ్మాండమైన "మాగ్నాలియస్" [MAGNALIUS]ల వల్ల కప్పబడి ఉంటుంది. అవి చాలా పురాతనమైనవే కాని ఈ విచిత్రద్రవ ప్రభావంవల్ల "వమెులెట్స్"లాగా నిత్యనూతనంగా తాజాగా ఉన్నాయి. ఈగాజు పాత్రలో మీరు చూస్తున్న ఈ విచిత్రద్రవాన్ని, అట్టి విషయాల్లో నా జిజ్ఞాసను గుర్తించిన పరిచయస్తుడొకాయన పంపాడు.

కర్నల్: [ఆసక్తితో] అయితే డాక్టర్? ఈ విచిత్రద్రవ ప్రభావం మానవశరీరం మీద ఎట్లాఉంటుందంటావ్?

మధు: ఎక్జాక్ట్లీ! దటీస్‌వాట్ ఐయామ్ ఆల్సోథింకింగ్.

డాక్టర్: మైడియర్ కర్నల్! మధురిమా! అది మీరేనిర్ణయించాలి. మైరెస్పెక్టెడ్ ఫ్రెండ్స్! మళ్లీయౌవన ప్రాదుర్భావాన్ని ప్రసాదించే ఈ విచిత్రద్రవాన్ని పరిశీలించవలసిందిగా మిమ్ములను అర్థిస్తున్నాను.

కర్నల్: డాక్టర్! మరిమీరో?

డాక్టర్: [మందహాసంతో] నా విషయమంటావా? బాధాకలితమైన నా జీవితం చరమావస్థలోఉంది. కనుక మళ్లీయౌవనం కావాలనే ఆశాలేశం ఏకోశానా నాకులేదు. అందువల్ల మీ అనుజ్ఞతో నేనూరక పరిశోధన క్రమాన్ని

పరీక్షిస్తూంటాను [అంటూ నాలుగుషాంపేన్ గ్లాసులు ఆ ద్రవంతో నింపుతూంటాడు]

మధు: ఈ ద్రవం మనోజ్ఞమైన సువాసనని వ్యాపింప జేస్తూందిగదా?

కర్నల్: ఎస్. ఆ ద్రవం అడుగుభాగంనుంచి చిన్నచిన్న బుడగలు క్రమంగాపైకి వచ్చి గ్లాసుపైభాగంలో తెల్లని వానజల్లులలె పగులుతున్నాయి.

రంగా: సర్టన్లీ! ఈ ద్రవం హాయిని, ఉత్సాహాన్నియిచ్చే గుణాలుకలిగి ఉందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

మధు: సో. లెటస్ స్వాలో ఇట్ అట్‌వన్స్.

కర్నల్
రామ
రంగా
ఎస్. ఎస్.

డాక్టర్: మైరెస్పెక్టబుల్ ఓల్డ్‌ఫ్రెండ్స్! మీరీద్రవాన్ని సేవించేముందు నా స్వాను భవాన్ని పురస్కరించుకొని మిమ్మలను కోరేదొక్కటే. ఈ ద్రవాన్ని సేవించింతర్వాత సంభవించే పునర్యౌవనంవల్ల అనుచిత కార్యాచరణకి లొంగకుండా ఉండేందుకు మీరు సర్వసాధారణమైన నియమాలను అనుసరించడం మంచిది. యౌవనవంతులైన తర్వాత మీ అసాధారణ అనుకూలాల ఆధారంగా నేటి యువతీ యువకులకి మీరు మార్గదర్శకులు కానినాడు అదెంత పాపభూయిష్ఠంగాను, నిందాభాజకంగాను ఉంటుందో యోచించండి!

[అతిథులు కంపిస్తున్నగొంతుతో బలహీనంగా నవ్వుతారు]

డాక్టర్: [మందహాసంతో] డ్రింక్‌దెన్! నా పరిశోధనకి తగిన వ్యక్తులనే ఎన్నుకొన్నాను.

[అతిథులు ఆద్రవాన్ని త్రాగుతారు]

డాక్టర్: [చిరునవ్వుతో] ఒక్కక్షణంలోనే మీలో ఎంతమార్పు కనిపిస్తూంది. మీ ముఖాలు ప్రకాశవంతమౌతున్నాయి. వృద్ధాప్యంవల్ల ముడతలుపడ్డ మీ చెక్కిళ్ళు మరొక్కసారి అందంగా తయారౌతున్నాయి.

[అతిథులు విస్మయంతో ఒకరివేపు ఒకరు చూసుకొంటారు]

మధు: [సిగ్గుతో పైటసర్దుకొంటుంది.]

డాక్టర్; నిజంగా మీలో ఎంతో మార్పువచ్చింది. ఏమంటారు?

మధు: [ఎంతో ఆసక్తితో] ఈ విచిత్రద్రవాన్ని ఇంకా ఇవ్వండి డాక్టర్!

కర్నల్: మాకు మళ్ళీ యౌవనం వస్తూంది!

రామ: కాని ఇంకా వృద్ధులుగానే ఉన్నాం.

మధు,కర్నల్ :
రామ, రంగా : క్విక్, గివ్ అజ్ మోర్!

డాక్టర్: [పరిశీలిస్తూండి] ఆగండి. తొందరపడకండి. ఎప్పటినుంచో వృద్ధాప్యం మిమ్మల్ని ఆవహిస్తూంది. కనుక అరగంటలో మళ్ళీ యౌవనం పొందేందుకి ఆసక్తిఉండడం సహజం. అయితే ఈ ద్రవమంతా మీకోసమే. ఈ నగరం లోని సగంవృద్ధుల్ని యువకులుగా తయారుచేసేందుకు తగినంత ద్రవ ముంది. [అంటూ మళ్ళీ ఆ నాలుగుగ్లాసులు ద్రవంతో నింపుతాడు]
[అతిథులు వెంటనే అందుకొని ఒక్క గుటుకులో గ్లాసులు ఖాళీచేస్తారు.]

డాక్టర్: మీలో ఎంతోపరిణామముంది. మధురిమ ఎలజవ్వనిగా తయారైంది.
[అంటూ వాళ్ళని పరిశీలిస్తూంటాడు ]

కర్నల్: [మధురిమ ముఖంమీద దృష్టి కేంద్రీకరించి] మధురిమా! నీవు చాలా అందంగా ఉన్నావు.

మధు: [కర్నల్ మాటలని మామూలుగా విశ్వసించదు. కనుక వెంటనే అద్దం దగ్గరికిపోయి అద్దం ముందు కూర్చుండి ముఖాన్ని అద్దానికి దగ్గరగాఉంచి ముఖకవళికలు పరీక్షిస్తూ, సర్దుకుంటూ ఉంటుంది.]

[మిగతా ముగ్గురికి ఒకవిధమైన మత్తుకలిగినట్లౌతుంది.]

రంగా: [తూల్తూ రాజకీయనాయకునివలె లేచినిలబడి, తనముందు ప్రజానీకమున్నట్లు భావించి] మహాశయులారా! మీ కందరికి నా నమోవాకాలు. ఇక్కడ మన మంతా ఎందుకు సమావేశమయ్యామో మీ కందరికి తెలుసు. దేశభక్తి, జాతీ యౌన్నత్యం, ప్రజలహక్కులు, ఈమూడు శ్రేయోరాజ్యానికి చాలాముఖ్యం

ప్రతివ్యక్తి దేశభక్తి కలిగి ఉండాలి. అప్పుడే జాతిఉన్నత స్థితికి రాగలదు. అట్టి స్థితిలో ప్రజలకు సమానమైన హక్కులుండితీరాలి. అట్టినాడే శ్రేయో రాజ్యం సుస్థిరం కాగలదు. ఇంకా.... మీరంతా.... [మెల్లగా] అంటే.... యువకులంతా ముందుకు.... రావాలి....[ఇంకా ఏదేదో అనికొంచెం తెప్ప రిల్లి గొంతుసూర్చి గాంభీర్యంగా] నేడు నాలాంటి వృద్ధుడు కూడ.... కాదు ....తప్పుతప్పు. నాలాంటి యువకుడుగూడ దేశంకోసం ప్రాణత్యాగమైనా సరే చేయగలడంటే, ఇంకమీలాంటి యువతీయువకులమీద ఎంతో బాధ్యత ఉంది ... కాదంటున్నారేమో! నిజం మీ బాధ్యతనెంతో నేర్పుతో నిర్వహిస్తా రని విశ్వసిస్తున్నాను. ఇంతకంటే నేనుచెప్పవలసిందేమీలేదు. [అని కూర్చుంటాడు]

కర్నల్: [మధురిమమీద దృష్టిసారించి, గ్లాసుమీద 'టంగ్ టంగ్'మని మునివ్రేలితో వాయిస్తూ పాటపాడుతూంటాడు]

వహ్వా ఏమీమజా,
ఈ పానీయం మజా,
మధుర రసంలో కలదుసుఖం
మధుర మధుర స్వర్గసుఖం,
వహ్వా ఏమీమజా
ఈ పానీయంమజా
మమతలను మరిమరిరేపును
వ్యథలను పూర్తిగామాపును
ఇదినిజం నిజం
పొరపాటుగాదు నామాట

ఇదినిజం నిజం. ॥వహ్వా॥

రామ: ఈ మధ్యన మనస్సులో ఏదో అనుకొని ఏదో చేస్తూంటాను. యోచనకి, చేతలకీ, ఏమీ సంబంధ ముండదు. గాని ఇప్పుడిప్పుడే నాలోశక్తి ఆవహించి నట్టుంది. నాలోనవోత్తేజం కలుగుతూన్నట్టుంది. నిజం. మీరు నమ్మినమ్మక పోండి.ఉన్నవిషయమది. ఈచిన్నచిన్న చిల్లరవ్యాపారాల్లో ప్రయోజన

మేమిటి? నిజంగా మాట్లాడితే ఏమీలేదు. కాబట్టి ఇప్పటినుంచి ఇతర దేశాల్తో వ్యాపారం చేయాలి. అప్పుడు పైసాకొదులాభం. వేలు,లక్షల్లోనే లాభం. అబ్బా! ఎంతలాభం! నిజంగా గొప్పవ్యాపారం.... ఆబ్బే ... మిమ్మల్ని.... పార్ట్నర్‌గానా?.... అవేమీకుదరవ్!.... ఆఁ ....

మధు: [నృత్యభంగిమతో డాక్టర్‌ని సమీపించి] మైడియర్ ఓల్డ్‌డాక్టర్! ఈ అద్భుతమైన ద్రవం ఇంకా ఒకగ్లాసు దయచేసి అనుగ్రహిస్తారా?

డాక్టర్: సర్టన్లీ. మైడియర్‌మేడమ్! సర్టన్లీ! ఇదుగో. అప్పుడే నాలుగుగ్లాసులు పూర్తిగా నింపానుగా! మీరు అందుకోవటమే తరువాయి. నాకంతకంటే కావలసిందేముంది? [చాలమట్టుకి ఈపాటికి సూర్యుడస్తమిస్తాడు- మును చీకట్లు అలుముకున్నాయిగదంతా- కాని చంద్రునివలె ప్రకాశవంతమైన కాంతి గాజుపాత్రలోనుండి బయలుదేరి అక్కడున్న వ్యక్తుల ముఖాలమీద పడుతూంటుంది.]

రంగా: నిజంగా మనలో యువకరక్తం పెల్లుబుకుతూంది.

రామ: ఔను. మనమంతా నవయువకులం.

మధు: మరినేనో?

కర్నల్: నీకేం? చాలాఅందంగా తయారైనావ్. ముట్టుకొంటే కందిపోతావేమో అనే గులాబిలాంటినీచెక్కిళ్లు చూసినచూపులోనే మత్తుమందుజల్లే నీకళ్లు! పదహారేళ్ల పడుచుపిల్లలాగున్నావ్ మధురిమా!

మధు: ఆఁ! నిజంగానా డాక్టర్!

డాక్టర్: ఎస్. మీరంతా నవవిశ్వంలో నూతనంగా సృష్టింపబడ్డ వ్యక్తుల్లాఉన్నారు.

మధు, రంగా<br>కర్నల్, రామ } ఉయ్‌ఆర్‌యంగ్! ఉయ్‌ఆర్‌యంగ్!

[అంటూ బిగ్గరగాఅరచి, కొద్దిక్షణాలతర్వాత అందరూ బిగ్గరగా నవ్వుతారు.]

రామ: [వాతకాయంగల ముదుసలివలె గదిలో వంగినడుస్తూంటాడు.]

రంగా: [కళ్ళజోడు ముక్కుమీదికితోసి 'మేజిక్‌బుక్' పేజీలు ఒక్కటొక్కటే తిప్పుతూ పరిశీలిస్తున్నట్టు నటిస్తాడు.]

కర్నల్: [ఆర్మ్‌ఛైర్లో కూర్చుండి డాక్టర్ని అనుకరిస్తున్నట్టు నటిస్తాడు.]
[అతిథులు నలుగురు కేరింతలుకొడుతూ గదిలో గంతులువేస్తుంటారు.]

మధు: [ఆనందంతో గంతుతూ డాక్టర్ దగ్గరికివచ్చి] డాక్టర్! యూ డియర్ ఓల్డ్‌సోల్! 'నాతో' రాక్-ఎన్-రోల్' డాన్స్‌చేస్తారా?
మిగతా ముగ్గురూ బిగ్గరగా ఒక్కసారిగా నవ్వుతారు.]

డాక్టర్: [విస్మయంతో] ఆఁ! క్షమించు మధురిమా! నేను వాతశరీరం గలవాణ్ణి; వృద్ధుణ్ణి. నేనుడాన్స్‌చేసే రోజులు ఎప్పుడో గతించిపోయాయి. నీకుడాన్స్ మీద అంతగా అభిలాష ఉన్నట్టయితే ఈయువకుల్లో ఏ ఒకరిని కోరుకున్నా సంతోషిస్తారుగదా?

కర్నల్: [చిరునవ్వుతో] మధురిమా! నాతో డాన్స్‌చేస్తావా?

రంగా: నో.నో. ఆమెతో డాన్స్ నేనుచేస్తాను?

రామ: సారీ జంట్ల్‌మెన్! ఆమె యాభై యేళ్ళక్రితమే నాకుమాటిచ్చింది.
[కర్నల్, రంగారావు, రామనాథం ముగ్గురు మధురిమచుట్టూ చేరుతారు— కర్నల్, రంగారావు ఇద్దరూ ఆమె రెండుచేతుల్ని పట్టుకొంటారు. రామనాథం ఆమె కురులను సవరిస్తూంటాడు. ఈదృశ్యం అద్దంలో ప్రతిబింబిస్తూంటుంది. మధురిమ ఏమీమాట్లాడదు- అందరూ నవ్వుతూ, కేరింతలు కొడుతూండి, వాళ్ళలోవిరోధం రేకెత్తి వాళ్ళపెనుగులాడడంలో బల్ల అటుఇటూ బడబోతుంది- ఒక్కసారిగా దానిపైనున్న గాజుపాత్రక్రిందపడి శతశకలాలై పోతుంది- అందులోని యౌవనప్రాదుర్భావాన్ని కలిగించేద్రవం కాంతిమంతమైన ధారగా ప్రవహిస్తుంది- ముసలిదైన సీతాకోకచిలుక ఆద్రవంలో తడిసి యౌవనవంతమై రెక్కలార్చిపోయి డాక్టర్ బట్టతలమీద వ్రాలుతుంది]

డాక్టర్: [అదంతాచూచి] కమ్ కమ్ జంట్ల్‌మెన్! మధురిమా! నీవుగూడ వచ్చేసెయ్ ఉత్తమ మిత్రులైన మీమధ్య ఈలాంటి కలహం నేనుసహించను.
[ఆమాటలు వినగానే వాళ్ళంతా వణికిపోతు డాక్టర్ని చూస్తుండిపోతారు- డాక్టర్ ఆగాజుపాత్రతోసహా పడిపోకుండా రోజానిపట్టుకొంటాడు. సంజ్ఞ చేయగానే వాళ్ళంతా కలహంమాని ఆసనాల్లో కూర్చుంటారు.]

డాక్టర్. [రోజానిచూపిస్తూ] మరదృష్టవంతురాలైన నాశోభ ఇచ్చినరోజా ఇది. ఇది మళ్లీ వాడిపోతున్నట్లుంది. నిజమే! ఇదివాడి పత్తయిపోతూంది. మిత్రులారా!

ఇటుచూడండి. ఆ ద్రవంలో ముంచకపూర్వం ఎట్లాఉందో మళ్లీ అదేవిధంగా మారిపోతూంది- ఈరోజా! ఇదివాడిపోయినా ఫ్రెష్‌గా ఉన్నట్టుగానే దీన్ని ప్రేమిస్తాను [అంటూ పెదవులతో ముద్దుపెట్టుకొంటారు- డాక్టర్ మాట్లాడుతూండగా సీతాకోకచిలుకగూడ మళ్లీ ముసలిదైపోయి డాక్టర్ బట్టలమీదనుంచి క్రిందపడిపోతుంది]

రంగా: భయంతో] ఏదో వణుకుపుట్టితూంది.

రామ: అవ్యక్తమైన చలి,బాధ కలుగుతున్నాయి.

కర్నల్; ఔను. అంతేకాదు మనయౌవనమంతా పోయింది. పూర్వంలాగానే మనం వృద్ధులం.

మధు; [భయంతో] ఇదంతా ఏమిటి? మోసం కాదుగదా?

డాక్టర్; [గాంభీర్యంగా చిరునవ్వుతో] మళ్ళీమీరంతా మామూలువృద్ధులుగా తయారయ్యారు.

రంగా : రామ<br>ధుమ :కర్నల్ } [బిగ్గరగా] అయ్యో ఇంతతొందరగానే మేమంతా వృద్ధులమయ్యామా? మోసం.

డాక్టర్: ఔను. మీరంతా వృద్ధులైపోయారు. ఈద్రవానికి కొంచెం ఎక్కువమత్తు కలిగించే గుణముంది. కనుక ఆద్రవంవల్ల కల్గినకైపు పూర్తిఅయింది.

మధు: [దుఃఖంతో] నిజంగానే నేనుమళ్ళీ యువతినయ్యానుగదా అని ఎంతగానో మురిసిపోయాను. కాని అప్పుడే వృద్ధురాలినైపోయాను. నిజమేనాడాక్టర్! అట్లెప్పటికికాగూడదు. [అంటూ తనచేతుల్తో ముఖాన్ని కప్పుకొంటుంది]

డాకర్: ఎస్ మధురిమా! మీరంతా మళ్ళీవృద్ధులే. మీ కలహంమూలాన యౌవనాన్ని కలిగించే ద్రవమంతా దుర్వ్యయంచేశారు. దానికి కారణం మీలో పునర్యౌవనం కలగటమే.

కర్నల్: పోనీ డాక్టర్! ఈద్రవం ఎక్కడ లభిస్తుందన్నారూ?

రామ:"ఫ్లొరిడా ద్వీపకల్పందక్షిణభాగంలో మొకాకోనరస్సుకి దగ్గరలోనే ఉంటుంది. ఆఫేమస్ ఫౌంటయిన్ ఆఫ్‌యూత్" నిజమేగదా డాక్టర్?

డాక్టర్ :ఎస్ కరెక్ట్!

రంగా; ఉంటేమాత్రం, అదెట్లా లభిస్తుందంటారు?

మధు: రత్నంమనల్ని వెతుకుతూరాదు. దాన్ని అన్వేషిస్తూ మనమేవెళ్ళాలి. మనం ఫ్లారిడాకువెళ్ళి అద్రవాన్ని ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం ముప్పూటలా సేవిస్తూందాం. అద్రవం నిత్యనూతనం. మనంనిత్యయౌవనులం. మరి 'ఫ్లారిడా'యాత్రకు మీరంతా సిద్ధమేనా?

రంగా, కర్నల్, రామ } తప్పకుండావెళ్దాం. పదండిపోదాం!

[అతిథులు నలుగురూలేచి నిలబడతారు]

డాక్టర్: మైడియర్ ఓల్డ్‌ఫ్రెండ్స్! వెల్! దాన్నిగురించి నేను దుఃఖించను. ఎందుకంటారా? అద్రవం నావాకిలిముందే ప్రవహించినప్పటికీ, దానివల్ల కలిగే నిషా క్షణికముగాక శాశ్వతమైనప్పటికి నేనుదాన్ని సేవించేందుకు సమ్మతించను. పుట్టినతర్వాత గిట్టడం ప్రకృతిసిద్ధం. కనుక బాల్యంతర్వాత యౌవనం దానివెనుపెంట జరామరణాలు ప్రతిప్రాణికి సహజంగదా? [అంటూండగా అతిథులు మెల్లగా వెళ్ళిపోతూంటారు] డియర్‌ఫ్రెండ్స్! సచ్ ఈజ్ ది లెసన్ యూ హేవ్ టాట్ మీ! గుడ్‌బై టుయూ ఆల్! [అంటూ వెళ్ళుతూన్న అతిథులవైపు చూస్తూండగా]

—తెర—

[ఆకాశవాణి సౌజన్యంతో]

........................oo 00 00 00 oo... ....................

['NATHANIEL HAWTHORNE' రచించిన

"Dr. HEIDEGER'S EXPERIMENT"

అనే కథ అధారంగా ]



# ఉపాయం [ నాటిక ]

పాత్రలు

చంద్ర

రామారావు

దొంగలు

[వంటింట్లో పాత్రల శబ్దం]

భార్య: ఏమండీ! ఏమండీ!

భర్త: .... [గుర్రుశబ్దం. పలకడు]

భార్య: ఏమండీ! మిమ్మల్నే! ఏమిటండీ! ఈమొద్దునిద్దురా! లేవండీ!
[భర్తని కదుపుతుంది]

భర్త: [లేచి కంగారుగా!] ఏమైంది చంద్రా!

చంద్ర: ఉష్ .......మెల్లగా! గట్టిగామాట్లాడకండీ! వంటింట్లోశబ్దం వినిపించటంలా?

భర్త: ఆఁ ? ఆఁ ! ఆఁ !........వినిపిస్తూంది.

చంద్రా ఈమధ్య కాలనీలో దొంగలబెడదగదా! దొంగవచ్చాడేమోనండీ! అయినా ఈరైలుపెట్టెలాంటి ఇల్లు ఒద్దుమొర్రో అంటే మీరువిన్నారుకాదు! పైగా మన ఇల్లేమో చివరం ఎలాగండీ!

భర్త: అయినా ఇప్పుడు శబ్దంలేదుగా!

చంద్రా ! అలాగేవుంటుంది ఆవెధవపనీ లేకమనం వినేలా గట్టిగా శబ్దంచేస్తారా! కాలనీచివరి అడ్డరోడ్డులో చివరింటిలో తెలుసుగా! స్టీలుపాత్రలన్నీ గోతాములో సట్టుకెళ్ళారండీ దొంగలు!

భర్త: అయితే! ఇప్పుడెందుకో ఆసోది! ఏమిచేయమంటావు?

చంద్ర: నన్నడుగుతారేమండీ? దొంగల్నిపట్టుకోవాలండీ! పోలీసులకప్పగిస్తే బహుమానం ఇస్తారండీ!

చంద్ర: నన్నడుగుతారేమండీ? దొంగల్ని పట్టుకోవాలంటే! పోలీసుల కప్పగిస్తే బహుమానం ఇస్తారండీ!

భర్త: సరె! సరె! నీసోదేంగాని, పక్కింటి రామారావునిపిలిస్తే!

చంద్ర: సిగ్గుచేటుకాదండీ! మా బామ్మఓకథ చెప్పేదిలేండి.

భర్త; ఏమిటది?

చంద్ర: ఒకానొకరాత్రి భార్యామణి "తేలుతేలురండి,రండి" అనగానే, భర్తగారు వెంటనే వీధిలో మొగవారెవరైనా గలరేమో పిలువమన్నారుట. భార్య "అదేమిటీ మీరుమగవారేగదా!" అందట. భర్తగారు 'ఔనౌను'! నేను మగవాడనేనా! అయినా తుపాకీఇటుతెమ్మ. కాల్చిచంపెద అన్నాడట. ఇంతలో తేలుతప్పించుకొంది. భార్యామణి ఒక్కటేగోల. సరిగ్గా అలాగే వుంది మనకథకూడ!

భర్త: ఛ ఛ! ఏమ్మాటలవి? దొంగలంటే నాకేంభయమనుకొంటావా? ఏమి?

చంద్ర: అట్లానేనన్నానా? మీరు వీరులు,శూరులని నాకుతెలీదటండీ! మనకార్యమైనకొత్తల్లో మాఊళ్ళోజరిగిన దెయ్యం సంఘటన....

భర్త: ఛ! ఛ! అవన్నీ ఎందుకిపుడు! జరిగేదేదోచూడక.

చంద్ర: [చిన్నగానవ్వుతూ] ఔనండీ! అదిగో మళ్ళీవంటింట్లోశబ్దం.

భర్త: ఓ ఈడిక్కుమాలిన కరెంటూపోయింది. ఏదీ అటార్చేది. ఎక్కడతగలెట్టావ్?

చంద్ర: పెద్దగాకేకలు వేయకండి.

భర్త: ఈటార్చీ సరిగ్గా వెలగదేమో! దీనికికూడా రోగం ఇప్పుడేవచ్చింది. అం నరేపద!

చంద్ర: మీరే నడవండిముందు.

భర్త: అదికాదే! నేనుటార్చివేస్తూంటానుగదా! పద ముందునడు.

చంద్ర: అలాకాదు! మీజబ్బపుచ్చుకొనివస్తాను. ఇద్దరం ఒకేసారి నడవచ్చు. అం - ఇహకదలండి.

భర్త+చంద్రా: [అడుగులశబ్దం- తలుపులుతీయగా క్రమనేశబ్దం]

భర్త: ఏమిటే! ఏమీలేదు. దొంగలు దొంగలు అన్నావే! మంచినిద్ర చెడగొట్టావు!
నీదంతా ఒట్టిహడావిడి పిరికితనమే!
[వంట బీరువావెనుక శబ్దం]

చంద్ర: అదిగోనండీశబ్దం! వినిపించడంలా, [అంటూండగా, పిల్లిదూకి పరుగెత్తి పోతుంది.]

భర్త: ఛ ఛ! వెధవపిల్లి, ఎంతపని చేసింది! చూశావా, నీతెలివితక్కువపని?

చంద్ర: [నవ్వుతూ] అవున్లెండి, నేనుతెలివితక్కువదాన్నే.

భర్త: ఇహచాలు. అపునవ్వు, నిద్రపాడుచేయక బుద్ధిగా వెళ్లిపడుకో!

చంద్ర; ఆగండి! ఓనిముషం. నాని,చిట్టి వరండాలో పడుకొన్నారు. ఓసారిచూసి వస్తాను.

భర్త: నిద్రపోతున్నారురావే! కన్పించడంలా! టార్చివేస్తే, కిటికీగుండా తెలియదూ?

చంద్ర: ఆc నిజమే! బాగానిద్రపోతున్నారండీ! చినుకులు! ఏమన్నాజల్లు పడుతుందేమో?

భర్త: జల్లుపడితే కేకవేస్తారులేపద!

చంద్ర: సరేపదండి.

భర్త: ఇకగొడవచెయ్యకు నిద్రపో. అప్పుడే రాత్రిఒంటిగంట కావస్తుంది. [గూర్ఖా లాటీకర్రశబ్దం, విజిల్ వినిపిస్తాయి.]

చంద్ర: ఆc అదిగో గూర్ఖా తిరుగుతున్నాడు. మనం సుఖంగానిద్రపోవచ్చు.

భర్త: ఆc సరే!

[ఇద్దరూ నిద్రపోతుండగా గుర్రుశబ్దం.]

= × = × = × = × =

[కటకటాల్ని టిక్ టిక్ అనికొట్టినశబ్దం]

చంద్ర: [కలవరపోయిలేచి] ఏమండీ! ఏమండీ!

భర్త: [నిద్రపోతూనేఉన్నాడు. పైగాగుర్రుశబ్దం]

చంద్ర: ఈయనకేమో మొద్దునిద్ర! బైటేమోశబ్దం. గూర్ఖాకాబోలు!

[మళ్లీ కటకటాల్ని కొట్టినశబ్దం]

భర్త: ఆఁ! నిజమేనా!

చంద్ర: నిజమండీ! శబ్దంవినిపించడంలా?

దొంగ: ఏమండోయ్ రామారావ్?

రామా: నాపేరునీకెలా తెలుసు?

దొంగ: ఇక్కడ ఇంత బోర్డుండగా- తెలియదంటావు. పైగాతెలుగులోనే రాయించు కొన్నావు. అయిన మాకెందుకుగాని, నీ ఇల్లుభద్రం చేసుకొన్నారనుకొన్నాను, భయంలేదనుకొంటున్నావు కాబోలు. లోపల ప్రవేశించడం మాకేమిదీ పెద్ద పనికాదు. శ్రమదండగ. నీకుకష్టం- ఓఉపాయం చెబుతున్నావిను.

రామా: ఏమిటది? [రెట్టించాడు]

దొంగ: గట్టిగా గావుకేకలెందుకు?

చంద్ర: [భయంతో మెల్లగాచెవిలో] ఏమండీఫోన్‌చేయండి, పోలీసుస్టేషన్‌కి.

దొంగ; మేము తెలివిలేనివాళ్లంకాదు. ఫోనుతీగలు ఎప్పుడో తెగిపోయాయి. మీ ఫోనుపనిచేయదు. వృధాశ్రమ.

రామా
చంద్ర } ఆఁ ఁ .... అలాగా?

దొంగ: ఆఁ అంతే!

చంద్ర: ఎలాగండీ!

దొంగ: గావుకేకలుపెట్టకండి! ప్రయోజనముండదు. పైగా ఆయుధాలకోసం ప్రయత్నించకండి. ఇదిగో చెబుతున్నా. మీపిల్లలే కాబోలు మంచినిద్రలో ఉన్నారు. ఇదిగోపిస్తోలు గురిపెట్టాను, ఏమాత్రం మీరుగొడవచేసినా మీ పిల్లలుమీకుదక్కరు. జాగ్రత్త.

చంద్ర: అయ్యయ్యో! ఎలానండీఇప్పుడు? మీరలా గుడ్లప్పగించి చూస్తున్నారే! ఆ వరండాలో పడుకోవద్దురాఅంటే విన్నారుకారు. ఇప్పుడేమిచెయ్యాలి?

దొంగ: ఒకపే! నీవొంటిమీద నగలిచ్చేయ్

చంద్ర: ఆఁ. నేనివ్వను. (దుఃఖిస్తుంది.)

దొంగ: అయితే మీపిల్లలు!

చంద్ర: ఆఁ అమ్మబాబోయ్! ఒద్దు ఒద్దు!

దొంగ: మరిఆలస్యందేనికి? మాకాలంచాలా విలువైంది. మీకుతెలియదు. ఇహ కానీయండి. ఊఁ....

రామా: పోనీ ఇచ్చెయ్‌వే! మనఖర్మ!

దొంగ: అదిగో ఏదోబాధపడుతున్నట్లున్నారు. ఊఁ!

రామా: కానీవే! తొందరగా! ఈపెడదన్నాతప్పుతుంది.

దొంగ: మావాడిచేతికి, కిటికీగుండా ఇలా ఒక్కొక్కటి ఇవ్వండి. గాజులు, చంద్ర హారం, బంగారంగొలుసు- గడియారం, కమ్మలు. ఇంతేనా? ఇంకాఏమైనా ఉన్నాయా?

చంద్ర: [భయపడుతూ దుఃఖిస్తూ] లేవు లేవు!

దొంగ: అదిగో మంగళసూత్రంతాడు మెళ్లో! ఆఁ అయినా ఉంచుకో! పైగామీఆయన కూడా దగ్గరున్నారుగా! ఏదో 'ఒక్క' ఊఁ -

రామా: లేదు లేదు.

దొంగ: లేదు? నిన్ననేగా జీతమిచ్చారు. ఇంతలో ఎక్కడికిపోతుంది?

రామా: అప్పులవాళ్ళకిచ్చేశాను. ఉద్యోగస్తుల స్థితులందరికీ తెలిసినవే!

దొంగ; తెలుసులే! లే తొందరగా! ఇదిగో పిస్తోలు.

చంద్ర: ఇచ్చేయండీ! వందేగా ఉన్నదీ!

దొంగ; ఊఁ! ఆలస్యందేనికి? మీకేప్రమాదం.

రామా: [దిండుకిందనుంచి తెచ్చిఇస్తాడు]

దొంగ: ఎంత? ముష్టివందేనా! ఊఁ సరే! చూడండీ! జాగ్రత్త. అరచిగావుకేకలు పెడితే ప్రయోజనముండదు. ప్రాణాలమీద తీపిఉంటే నోర్మూసుకోండి. గండం సమయంలో మీకెవరూ సాయంరారు. ఎవరిభయంవారిది. టార్చి వేయకండి. ఊఁ వెళ్ళండి బెడ్‌రూమ్‌కి.

[పలాయనం చిత్తగిస్తారుదొంగలు]

చంద్ర } [బెడ్‌రూంలోకి వెళ్ళిపడుకుంటారు కిక్కురుమనకుండా]
రామా }

చంద్ర: [సన్నగానవ్వుతూ] ఏమండీ

రామా: నవ్వుతావే పడుకో? మనఖర్మ. ఉదయంవెళ్ళి రిపోర్టుఇస్తాను పోలీస్ స్టేషన్‌లో.

చంద్ర; ఎందుకూ నేనిచ్చినవేమో గిల్టునగలు. మీరిచ్చిన వందరూపాయలనోట్లు ఫేక్‌నోట్సు. పాపం దొంగలకు మంచిలాభం!

చంద్ర
రామా } [నవ్వుతూండగా]

:- తెర :-

# చిగురించినమోడు

[నాటిక]

పాత్రలు :- సుశీల
రామయ్య
శంకరం
చంటి
దానం
యువకుడు.

రంగం - I

[తెరతొలుగుతుంది_పైకప్పుపోగా మొండిగోడలు - చెల్లాచెదరుగా పడివున్న తాటాకులు- ఇంటి ముంగిలి]

సుశీల:- [నడివయస్సు-సంస్కారరహితంగా ఉన్నతల - శోకమూర్తిలా ఉన్న ఆకారం - కన్నీరుమున్నీరుగా శోకిస్తూ ఉంటుంది- తుఫానువల్ల సర్వం కోల్పోయిన గృహిణి- క్రమంగా చీకటి తొలగి వెలుగు ప్రసరిస్తుంది]. బాబులూ ఎక్కడున్నారా ! చంటీ ఎక్కడున్నావమ్మా ! బుజ్జిగా ఎలా ఉన్నావు ? పెద్దాడా నీవూపోయావా ? మీరులేకుండా నేను బతగ్గలనా ? ఈ

ఘోరమైన తుఫాను సైతాన్‌లా తాండవిస్తుందనుకోలేదు. ఇలా కొంపమునిచి పోతుందనుకోలేదు. మీకోసం వచ్చిన మీ నాన్నగారూ రాలేదు? మీరసలే రాలేదు. ఏమయ్యారు ? ఎక్కడున్నారు బాబు ? ఎలా మీ ముద్దుమొహాలు చూడగలను ? నాకా అదృష్టముందా ? తెల్లారిందా ? లేదు. నా జీవిత మంతా చీకటేనా ?

ఇంటి కప్పు ఆ గాలికి ఎప్పుడో ఎగిరిపోయింది. నిలువనీడలేదు. కట్టు గుడ్డల్లేవు. తాగనీరులేదు. పండిన వరి చేలని ఊడ్చుకుపోయింది ఉప్పెన. పొలం దగ్గరికి పోయిన పెద్దాడుపోయాడు. బాతులకోసం పోయిన బుజ్జి, చంటి బాబులిద్దరూ పోయారు. ఇంకలేదు- అంతానాశనమైపోయాక దేనికోసం నేను జీవించాలి ? గుండెలు బద్దలుకావే ? తలలో రక్తనాళాలు తెగిపోవే?

ఏమండీ మీరేమయ్యారు ? వస్తున్నారా? ఎక్కడ? ఏరీలేరే? రాలేదు రారు. అయ్యో నేనుఅనాథను. అభాగ్యను. నాజీవితం నరకమే.

మీరులేకుండా నేనుబ్రతగ్గలనా మీరంతాబ్రతికి నేనుపోయినా బాగుండేది. నేనంత అదృష్టానికి నోచుకోలేదు. ఎన్నిజన్మలపాపఫలమోఇది! రెక్కలూడినపక్షిలా, కొమ్మలువిరిగినమోడులా, ఉన్నజీవితం దుర్భరం. వ్యర్థం.

బాబూ! చంటి! ఏదిరా నీముద్దులమెహం చూపించరా! తనివితీరా ఒక్కసారిచూస్తారా! బాబూనీవేనాబుజ్జీ! అన్నయ్యేడీ? తమ్ముడేడి? ఓహో పెద్దాడా మీనాన్న! తమ్ముళ్ళెక్కడబాబూ! వెనకొస్తున్నారంటావా? నాన్నదగ్గరున్నారంటావా! నాన్నగారేరీ? ఎక్కడ? [మూర్ఛపోతుంది. .. కొంతసేపటికి కాస్తతేరుకొంటుంది]

శంకరం:- [ప్రవేశించి] ఏమిటేమిటి? అమ్మాయ్‌సుశీలా! ఏమిటమ్మాఇది?

సుశీల:- [పరిశీలనగాచూసి] ఎవరూ బాబాయ్ [అంటూబావురుమని ఏడుస్తుంది.]

శంకరం:- రోజూ గలగలా మాట్లాడేనీవేనా? కళకళలాడేనీముఖమేనా? శోకమూర్తిలాఉన్నావే? దీనాతిదీనంగా ఉందే నీముఖం అయ్యోయ్యో ఎంతఘోరం! ఎంతఘోరం! ఏమిటమ్మాయిది?

సుశీల:- ఇంకేముందిబాబాయ్! అంతామునిగిపోయింది! సర్వంనాశనమైపోయింది. బాబులుముగ్గురూపోయారుబాబాయ్ [దుఃఖిస్తుంది.]

శంకరం:- ఛీ ఛీ అవేంమాటలు? ఎక్కడో ఉంటారు వస్తారు. తప్పకవస్తారు.

సుశీల:- అంతానాశనమైపోయాక ఇంకాఎక్కడవస్తారు. లేరు నాబాబులులేరు. ఉంటే ఈపాటికి అమ్మకోసం పరుగునవచ్చేవాళ్లే. నేనుపాపిష్టిదాన్ని. బాబులకోసం వారినిపంపాను. వారు రాలేదు. ఏమో భయంగాఉంది. మరి వారుకూడా ... [బావురుమంది]

శంకరం:- ఛ ఛ! అవేం అమంగళకరమైనమాటలు? ఈపాటికి తప్పకరామయ్య వస్తూనేఉంటాడు.

సుశీల:- ఏమిటిబాబాయ్! మీరనేది? ఇంత ఘోరకలి జరిగిపోయాక ఇంకా వస్తారంటారా? మనకళ్లెదుట ఇంతప్రళయం జరిగిపోయిందే! మీదాబా ఇంటిలోనే నుఉండడంవల్ల బతికానేకాని మామూలు కొంపలన్నీఏమయ్యాయి? తక్కిన మన బంధువులంతా ఏమయ్యారు? సర్వంకోల్పోయారు.

ప్రాణాలు పోగొట్టుకున్నారు. అది కాళరాత్రి. పెనుగాలులు, ఉరుములు మెరుపులు, మిన్నువిరిగి నేలపడినట్లుగా భీకరశబ్దాలు, కూలిపోతూఉన్న ఇళ్లు, నేలపాలవుతున్నచెట్లు, కరెంటు స్తంభాలు, ఒకటేమిటి! మరోప్రక్క సముద్రంలోంచివచ్చి తుఫానుఉప్పెనలు? ఇంకెక్కడిపిల్లలు? ఇంకెక్కడి వారు! అంధకారం! అంతా చీకటిమయం. జీవితమే చీకటిమయం.

శంకరం:- చూడమ్మాయ్‌సుశీలా! ఇలాంటిసమయంలోనే మనం నిబ్బరంగాఉండాలి. గుండెదిటవుచేసుకోవాలి. వెంటనే రామయ్యవస్తాడు. ఇలాగే ఎంతోమంది నిర్భాగ్యులు. మనం ఒక్కళ్లమేకాదు. మొత్తంకోస్తాప్రాంతమంతా నాశన మైపోయింది. పెనుతుఫాను తాకిడికి బలి అయిపోయింది.

సుశీల:- బాబాయ్! ఏమనిచెప్పమంటారు నాకడుపుకోత. నేను చచ్చి వాళ్ళంతాబ్రతికినా బాగుండేది. భగవంతుడు నాకలాంటి అదృష్టం ఇవ్వలేదు. నేనొక దురదృష్ట వంతురాల్ని. ఇలా అనుభవించాలని రాసిఉంది. ఎలా జీవించమంటారు బాబాయ్! నిన్నటిదాకా కళకళలాడినఇల్లు, ఈప్రదేశమంతా శ్మశానవాటికగా మారిపోయింది. ఈఘోరమంతా చూడడానికీ, అనుభవించడానికీ నన్ని నరకంలోఉంచాడుబాబాయ్ భగవంతుడు. నా బాబులురారు! ఇంకరారు ? ఎక్కడబాబూ! బాబూ! [స్పృహతప్పిపడిపోతుంది.]

శంకరం:- అమ్మాయ్ సుశీలా! సుశీలా! అయ్యో ఏమిటిలా? మొహంమీద చల్లడానికి కూడా గుక్కెడుమంచినీళ్లులేవే? పోనీ ఈఉప్పునీరేచల్లుతా! [అంటూదోసిట్లో నీళ్లుచల్లుతాడు మొహంమీద]

సుశీల:- [కొంచెం తేరుకొని] బాబూ! బాబూ! వచ్చావా? ఏడీనాబాబు! ఏడేనా బాబాయ్! నాబాబు రాలేదాబాబాయ్!

శంకరం:- అడుగో........

సుశీల:- [ఆదుర్దాగా] ఎవరుబాబాయ్! చంటాడా! బుజ్జిగాడా? పెద్దాడాడా.

శంకరం:- కాదు కాదు.

సుశీల:- ఇంకెవరు?

శంకరం:- రామయ్య!

సుశీల:- నిజంగానా బాబాయ్! ఆయనొస్తున్నారా?

శంకరం:- అడుగో! ప్రళయప్రభంజనానికి విరిగిపడ్డ ఆపెద్దతాటిచెట్లు వెనకాతల.

సుశీల:- [విప్ఫారిత నేత్రాలతో] నిజంగానా బాబాయ్!

శంకరం:- అడుగో కనిపించడంలేదా అమ్మాయ్! చూడు; బరువుగా కాళ్లీడ్చుకొంటూ వస్తున్నాడు రామయ్య. రామయ్యే సందేహంలేదు.

సుశీల:- [ఎదురుచూస్తూ] ఆః ఆః కనిపించారు! వారే వారే........ [అనినవ్వి వెంటనే] కానీబాబాయ్ నాబాబులేరీ! వారివెంట రావడంలేదుగా? [అని దుఃఖిస్తుంది.]

శంకరం:- ఎక్కడో ఉంటారమ్మాయ్! రామయ్య చెప్తాడుగా! నీవేడ్చేపనిలేదు. చల్లటివార్త రామయ్యచెప్తాడ్లే?

సుశీల:- అలాగా చెప్పగలరా? మీ నోట్లో తియ్యటి చక్కెరపోయ్యాలిబాబాయ్. [అని నవ్వి సంతోషంగా వెంటనే] ఇంకా ఎక్కడిచక్కెర? అంతాగంగపాలై పోయిందిగా. [శోకిస్తుంది]

శంకరం:- రాత్రిగాలివానకి శోషించినట్లు ఉన్నాడు రామయ్య! [దుఃఖంతో కుమిలి పోతూఉన్నట్టున్నాడు.

సుశీల:- ఏమిఘోరవార్త చెబుతారో! ఏమండీ [గట్టిగా అరుస్తుంది]

రామయ్య:- [దగ్గరవచ్చాడు- కుమిలికుమిలి ఏడుస్తున్నాడు.]

సుశీల:- (కౌగిలించుకొని) ఏమండీ! పిల్లలెక్కడ? బాగున్నారా ? మాట్లాడండీ!

రామయ్య:- (మాట్లాడడు ఏడుస్తూంటాడు)

శంకరం:- ఏమిటి రామయ్యా! పిల్లలేరి? చూడుఅమ్మాయ్ సుశీల ఎలాగుందో? పిల్లల కోసం వేయికళ్ళతో ఎదురుచూస్తుంది. అమృతంలాంటివార్త తెస్తావుగదాఅని. మాట్లాడు.

రామయ్య:- (మాటలురావని సైగచేస్తాడు)

రామయ్యా: (కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు)

సుశీల: గడచినరాత్రి కాళరాత్రి- నాజీవితామంతా చీకటి చేసివేసింది. (అంటూ గట్టిగారోదిస్తూ మూర్ఛపోతుంది.)

శంకరం: అమ్మాయ్! సుశీల ఉండవమ్మా! రామయ్య చెపుతాడుగా.

సుశీల: (కొంచెం కొంచెం తేరుకొంటూ ఉంటుంది.)

రామయ్య: (సైగచేస్తాడు దుఃఖిస్తాడు)

శంకరం: తుఫాన్‌లో కొట్టుకుపోయారని సైగ చేస్తున్నాడమ్మాయ్! ఒక్కడు గూడా మిగల్లేదా?

రామయ్య: (లేదంటూ సైగచేస్తాడు దుఃఖంతో)

సుశీల: బాబాయ్! చూశారా! నాబతుకు బండలైంది. నాపిల్లలు లేరు. నాకడుపుకోత ఏమని చెప్పను? బాబూ చంటీ బుజ్జీ పెద్దాడా ఎక్కడున్నార్రా? ఇంత ఘోరం జరుగుతుందంటే పంపేదాన్ని కాదుగదరా? కని పెంచి పెద్ద వాళ్ళనుచేసి ఈ ఘోరమైన తుఫానుకు అప్పగించానా? నాకడుపులోంచి కడలి కడుపులోకి పోయారా? ప్రకృతి పగపట్టి మిమ్మల్ని పొట్టన పెట్టుకొంది. మీ ముద్దు మొహాలు నేనెలా చూడగలను? అమ్మాఅని పిలిచేవారేరీ? బాబాయ్! బాబాయ్ (అంటూ రోదిస్తుంది.)

శంకరం:- అమ్మాయ్ సుశీలా! ఎలాగమ్మా? నిన్నూరడించేది? రామయ్యా నీవెలా తిరిగి వచ్చావు ఏమైంది?

రామయ్యా: (సైగచేస్తాడు)

శంకరం: ఆఁ ఊఁ ఊఁ హూఁ అంటే ఘోరమైన వానగాలికి స్తంభించిపోయి చెట్టును పట్టుకొన్నారా? వర్షమూ ఉప్పెన విపరీతమైన గాలి కొడుతూ ఉన్నా గట్టిగా పట్టుకొన్నారా? నీకళ్ళముందే ముగ్గురు కొడుకులు నాన్నా నాన్నా అంటూ కొట్టుకుపోయారా! ఎంతఘోరం! ఎంతఘోరం! నీవు మాత్రం గట్టిగా చెట్టు మొదలు పట్టుకొని రాత్రంతా నీళ్ళలో చలిలో వణుతూ గడిపావా? తెల్లారగట్ల ఉప్పెనసీరు తగ్గాక బురదలో కాళ్ళీడ్చుకుంటూ వచ్చావా?

సుశీల: చూశావా బాబాయ్ (గట్టిగా రోదిస్తుంది) నేనుచెప్పానుగా ఈ ఘోరవార్త వినడానికే నేను బ్రతికిఉన్నాను- నాకుచావురాదే ? ఎలా?

రామయ్య: (సైగచేస్తాడు ఔనంటూ!)

శంకరం: అమ్మాయ్! సుశీలా! భయపడకు అన్ని ఏర్పాట్లు నేనుచేస్తాను. మళ్ళీ మామూలు జీవితం పొందుతావు.

సుశీల: ఇంకేముంది బాబాయ్? ప్రాణానికి ప్రాణమైన ముగ్గురు పిల్లలు పోయారు. ఆయన మూగవారై పోయారు.

శంకరం: మూగవాడైతేఏం? పిల్లలు కలగకపోతారా?

సుశీల: పిల్లలుకలిగే అవకాశం లేదు బాబాయ్ మేము కుటుంబనియంత్రణ పాటించాం. ఆ కుటుంబనియంత్రణ పుణ్యమా అని ఆయన వేసక్టమి చేయించుకున్నారు. మీరేకదా బాబాయ్ ప్రోత్సహించింది. ఇంకమాకు పిల్లలు పుట్టే అవకాశము లేదు. ఇంతే ఇంకమాకు నిరాశా నిస్పృహలే మాకు తోడు నీడలు. ఈదుర్భరమైన నిరాశలో ఆశ లేశమైనా అవకాశంలేదు. మునుపటి సంతోషం ఎలా వస్తుంది? మళ్లా మనుష్యులుగా మేము జీవించడమెలా?

శంకరం: వచ్చిన కష్టాల్ని ఎదుర్కోవాలమ్మాయ్! ఇలా కూలిపోతే ఎలా? (మనకేగాదు ఈకష్టం. ఎంతోమంది పిల్లల్ని పోగొట్టుకొన్నవారు, తల్లి దండ్రులను పోగొట్టుకున్న పిల్లలు, భర్తల్ని పోగొట్టుకొన్న భార్యలు, భార్యా రహితులైన భర్తలు ఎన్నోరకాలు. ఏమనిచెప్పను? ధైర్యం తెచ్చుకో అమ్మాయ్.

సుశీల: ఇంకేం ధైర్యం బాబాయ్, అంతా నాశనమైపో. సూక గూడుతోపాటు పిల్లల్ని కూడా పోగొట్టుకొన్న పక్షిలా ఉంది నాబ్రతుకు.

శంకరం: అమ్మాయ్ సుశీలా? చూడమ్మా జీవితం పడుగు పేకలనేత. జీవితంలో వెలుగు చీకట్లులా, సుఖఃదుఃఖాలు సహజం. కష్టసుఖాలు కావడికుండలు. మనం తప్పించుకోలేం. ఎప్పటికప్పుడే గతజీవితానికి భరతవాక్యం. భావి జీవితానికి నాందీ! తప్పదు.

సుశీల: దేన్నిచూసి భావిజీవితానికై ఆశలు పెంచుకొంటారు బాబాయ్?

దానం: [ప్రవేశించి] బాబుగారు! [అంటాడు]

శంకరం: ఎవరది!

దానం: నేను బాబుగారు! దానంని! సర్పంచ్‌గారు కబురుపెట్టారు. ఉన్నపళంగా రమ్మన్నారు!

శంకరం: అలాగే! వస్తున్నానని చెప్పు!

దానం: అలాగే బాబుగారు [వెళ్ళిపోతాడు]

శంకరం: అమ్మాయ్! చూడు: ఇంతసేపైనా మీకింకా కాఫీనీళ్లైనా లేవు. ముసురు పడే సంగతి దేవుడెరుగు. భోజనాలకి తక్కినవాటికి తగిన ఏర్పాటుచేస్తాను. జాగ్రత్త. మళ్ళీ వస్తాను. [అంటూ వెళ్ళిపోయాడు]

సుశీల: అంతా నాశనమైంది! నా బాబులు లేకుండా జీవించగలనా?

రామయ్య: [సైగలు చేస్తూ అనునయిస్తూ ఉంటాడు]

సుసీల: బాబూ! బాబూ! ఎక్కడరా బాబూ! [అంటూ రోదిస్తుండగా]

—తెర—

## రంగం -2

[తెర ఎత్తగానే సుశీల ఇంట్లో అటూ ఇటూ తిరుగుతూ ఉంటుంది.] మొహంలో సంతోషం లేదు- విషాదచ్ఛాయలే. ఏవో ఆలోచించి చివరికి ఒక నిర్ణయానికి వచ్చింది.]

సుశీల: ఏమండీ! రేషన్ ఇస్తున్నారట. వెళ్ళలేదే ఈరోజు?

రామయ్య: [సైగ చేస్తాడు]

సుశీల: ఇంకా టైం కాలేదంటారా? అయినా పర్వాలేదు. ముందుగానే వెళ్ళి ఆ వరుసలో నుంచుంటే తొందరగా రావచ్చుగా! వెళ్ళిరండి!

రామయ్య: [ఇంక విధిలేనట్లు వెళ్ళిపోతాడు. సుశీల వైపుచూస్తూ]

సుశీల: బాబాయ్ ఎన్ని చెప్పినా నాకన్నీరు తుడవడానికే! కానీ అబ్బాయిలు మాత్రం రాలేదు. ఇంకా బ్రతికే ఉన్నారని నేననుకోను. బతికే ఉంటే అమ్మను వెతుక్కుంటూ వచ్చేవారే? ఇహ నాజీవితానికి అబ్బాయిల్ని చూచే అదృష్టం లేదు. అబ్బాయిలు లేకుండా నేనెట్లా జీవించగలను? నా జీవితం వ్యర్థం, వృథా! ఆత్మత్యాగమే దీనికి తగిన పరిష్కారం. రేషన్‌కోసం వెళ్ళినవారు రాకముందే ఆకాస్తపనీ ముగించాలి! ఎలాగా [ఆలోచించి] ఆ! తెలిసింది. తెలిసింది. [నవ్వుతుంది పిచ్చిగా] ఈ తాడుతో ఉరిపోసుకుంటాను. [ఒక తాడుతెచ్చి పాకకు వేసిన అడ్డపట్టి వెదురుకర్రకు తాడు కట్టింది. - పోయినది పోగా మిగిలిన ఒక కర్రదిమ్మను అతి కష్టంమీద దొర్లించు కుంటూతెచ్చి ఆతాడుకింద సరిగా నిలిపింది. దాని పైకెక్కి ఆతాడుతో తన గొంతుకను గట్టిగా బిగించుకొనే ప్రయత్నంలో.... ఉండగా....]

శంకరం: [చూసి విస్తుపోయి పరుగునపోయి] అమ్మాయ్! [అంటూ కేకవేసి] ఏమిటీ ఘోరం? ఇంత అఘాయిత్యానికి పాలుపడ్డావా? ఛీ ఛీ ఏంపనమ్మా ఇది!

సుశీల: [కేకవిని ఆగి కన్నీరుమున్నీరుగా] ఆపకండి బాబాయ్‌గారు నన్నాపకండి! నాకు మరణమే శరణ్యం! నాకు గత్యంతరం లేదు. నాజీవితం ఇలా ముగియనీ బాబాయ్.

శంకరం: లేదు: లేదు! చావడానికి వీల్లేదు! తాడు తీసేయ్. రా దిగిరా.

సుశీల: [దుఃఖంతో నవ్వుతూ] ఏమిటి బాబాయ్! మీరనేది? నాకు చావటానికి కూడా అధికారం లేదా? పిల్లలు లేకుండా క్షణక్షణము చావలేను. ఈవిధంగా ఒక్కసారి చచ్చి బ్రతికిపోతాను బాబాయ్! బ్రతికిపోతాను.

శంకరం: నా బొందిలో ప్రాణం ఉండగా నిన్ను చావనిస్తానా? నేను చచ్చాకనే అపని [అంటూ చేయిపట్టుకొని కర్రదిమ్మె మీదనుంచి దించి కూర్చో బెడతాడు.]

సుశీల: [రోదిస్తూంది]

శంకరం: చూడమ్మాయ్ సుశీల! ఇలాంటి అఘాయిత్యం చేస్తావని తెలిస్తే ఇక్కడ్నుంచి వెళ్లేవాణ్నికాదు! ఇంతసేపు నేను లేను. రామయ్య ఎక్కడికెళ్లాడు? ఓహో స్టేషన్‌కి వెళ్ళాడా! ఇదే సమయమనుకొని ఈ ఘోర కృత్యానికి పాలు వడ్డావా? ఎప్పుడైనాగాని ఇలాంటి అఘాయిత్యానికి పాలువడ్డావో నా మీద ఒట్టే. మీ అబ్బాయిలను వెతికించడం కోసం అన్ని ఏర్పాట్లు చేసాను. తప్పక వస్తారన్న ఆశ నాకుంది.

సుశీల: [ఏడుపుతో నవ్వుతూ] ఇంకా ఎక్కడ బాబులు బాబాయ్ నా బాబు.... అంటూండగానే శంకరం నియమించిన సేవాదళంలోని ఒక యువకుడు చంటాణ్ణి వెంటతీసుకొని వస్తాడు.]

సుశీల: బాబూ చంటీ [పరుగున పోతుంది]

చంటి: అమ్మా! (అంటూ సుశీల కౌగిలిలో ఉక్కిరి బిక్కిరి అయిపోతాడు సుశీల సంతోషానికి అవధిలేదు.)

సుశీల: వచ్చావా బాబూ! నా తండ్రీ! నా బంగారు తండ్రీ! నాన్నా (నుదుటిన ముద్దు లాడించి) మిక్కిలి ఆనందంతో (ఆనందబాష్పాలు రాలుస్తూ.)

శంకరం: (అలా చూస్తూ కొంతసేపు ఉండి కళ్లొత్తుకొని నవ్వుతూండగా)

యువకుడు: ఈ అబ్బాయి నాకు తెలుసండి. ఈరోజు ఆ నిర్వాసితుల శిబిరంలో అంత మందిలో ఉండినా జాగ్రత్తగా వెదకానండి! అబ్బాయి కనిపించాడండి! నే వెళ్లొస్తానండి.

శంకరం: మంచిది బాబూ మంచిది వెళ్ళిరా! (సుశీలతో సంతోషంతో) చూశావా అమ్మాయ్! నేను చెప్పానుగా! తక్కిన ఇద్దరూ ఎక్కడో ఉంటారు. తప్పక వస్తారు.

సుశీల: అవును బాబాయ్! మీరు భగవంతుడిలా ఆదుకొన్నారు. వెదికించి నా బాబును అప్పగించారు బాబాయ్! ఈ సంతోష సమయంలో వారు ఇంకా రాలేదే? వస్తే తప్పక ఈ సంతోషంతో వారు పాలుపంచుకొంటారు. ఆ వారింకా రాలేదే?

శంకరం: అడుగో రామయ్య వస్తున్నాడమ్మాయ్! రేషన్‌తో తిరిగివస్తున్నాడు.

రామయ్య: (గుమ్మంలో అడుగుపెడ్తుండగానే)

సుశీల: మన చంటాడండీ (అంది కొంచెం గట్టిగానే)

రామయ్య: (మొహంలోకి చూసి మాట్లాడాలని ప్రయత్నించాడు- మాటలు పెగల్లేదు మరింత బిగ్గరగా అరవాలనుకొన్నాడు! సాధ్యంకాలేదు. కానీ కొంత అస్పష్ట శబ్దాలు వినిపించాయి.- మరింత బిగ్గరగా అరవాలని ప్రయత్నించి- బొంగురు బోయిన కంఠంతో బాబు అన్న శబ్దం స్పష్టంగా వినిపించింది. (ఈసారి) బాబూ (అనగలిగాడు పొదివి చంటివాణ్ణి కౌగిలిలోకి తీసుకొని స్వర్గసుఖం అనుభవించాడు అలాగే ఎన్నోసార్లు బాబూ!- బాబూ! అంటానే ఉన్నాడు]

సుశీల: (భర్త కంఠధ్వని విని అమితానందం పొందింది.) బాబాయ్! వారికి గొంతు వచ్చింది. మూగపోయిన గొంతు వచ్చింది బాబాయ్! (సంతోషంలో మునిగి పోయింది- భర్తను పిల్లాడ్ని చుట్టేసింది.)

శంకరం: అమ్మాయ్! ఈ శుభసమయం కోసమే వేచి ఉన్నానమ్మా! ఇంక నాజీవితం అంతా ఇతరుల సేవకే అంకితం చేస్తానమ్మాయ్!

సుశీల: బాబాయ్! బాబాయ్! (అంటూన్నా వినిపించుకోకుండా శంకరం వెళ్ళిపోతాడు సంతోషంతో)

--తెర--

# క్రాంతి

(నాటకం)

పాత్రలు:
సుందరరావు
అమ్మ
క్షమ
క్రాంతి
కృష్ణారావు

[ఇంకా ఫీల్డు పబ్లిసిటీ ఆఫీసరు, డైరెక్టరు, రిక్షావాలా]

## రంగం - 1

(ఆరుబయట రంగస్థలం - జనం గుమిగూడి ఉంటారు.)

### నాంది

పాట:

ఆనందపు కడలిలోనా
హాయి అలల ఊయలలోనా
ముద్దుల మురిపాలు
ముసిరిన ముచ్చట్లూ
పెను తుఫాను రేగేనా
అనుకం పింత వీగెనా
అలల వలలో
తల మున్కలుగా

నట్టనడి సంద్రాన చిక్కిననావ
గట్టుచేరి సంతనపు త్రోవ
ఇష్టే చూపేనా
ఇక్కట్లే మిగిలేనా

ప్రస్తావన:-

ఫీల్డు పబ్లిసిటీ ఆఫీసరు: (ప్రవేశించి) స్వాగతం, మహాజనానికి మాస్వాగతం ఆకాశవాణి వారి సౌజన్యంతో సమాచార పౌర సంబంధాలశాఖ పక్షాన

ఈనాడు సంగీత రూపకం ఏర్పాటు చేశాము. విచ్చేసిన మీకందరికీ మా హృదయపూర్వక స్వాగతం. ఇప్పుడు డైరెక్టరుగారు వివరిస్తారు.

డైరెక్టరు: మహాజనులారా! మీకందరికీ నా నమస్సులు. ఈనాటి ఈసమావేశం ప్రధానంగా కుటుంబ సంక్షేమానికి సంబంధించినది. పంటలు ఎంత ఎక్కువగా పండించినా, పరిశ్రమలు ఎన్ని నెలకొల్పినా, నిరుద్యోగమనే పీడ దేశాన్ని వేధిస్తూంది. కాబట్టి పెరిగి పోతున్న జనాభాని అరికట్టకపోతే మనం ఎన్నివిధాల ప్రయత్నించినా ప్రయోజనంలేదు. మీ కందరికీ తెలిసిందే. చిన్న కుటుంబమే చింతలేని కుటుంబమనీ, ఇద్దరు పిల్లలే ముద్దనీ, మంది ఎక్కువైతే మజ్జిగ పల్చనవుతుందనీ మీకు తెలుసు. మన భారతదేశం విశాలదేశం. రోజురోజుకీ, పెరిగిపోతూన్న జనాభాని అరికట్టవలసిన బాధ్యత మనమీద ఉంది. అందుకే ఈనాడు "కుచేలోపాఖ్యానం" సంగీత రూపకమూ, ఒక పాటప్రదర్శిస్తూన్నాము. పిల్లలు ఎక్కువైనందువల్ల కుచేలుని పాట్లు చెప్పవవిలేదని చూస్తే, వింటే మీకేతెలుస్తుంది. ఎంతోసేపు ప్రదర్శనకు, మీకు మధ్యన నేనుండ సమంజసముకాదు. దయచేసి ఆలకించండి. చిన్న కుటుంబంతో పచ్చగా బతకండి, దేశాన్ని రక్షించండి.

(సభలో చప్పట్లు - ప్రదర్శన)

పిల్లలు:- అమ్మా ఆకలే
అమ్మా అన్నమే
కట్ట గుడ్డలేక పోతే
గట్టిగా మేమేడ్వలేదే
ఎర్రటి ఎండలో ఎండినా
చర్రున వానలో తడిసినా

బాధపడనూ లేదు
బాధించనూ లేదు

ఆకలి మంటలు - అర్పినా
అగని మంటలు - అణచినా

దాగని మంటలు
మంటలు మంటలు
ఆకలి మంటలు
అమ్మా ఆకలే
అమ్మా అన్నమే

కుచేలుడు:- (విచారంగా ఉంటాడు) బాధాకరం భరించలేను. కృష్ణా! కృష్ణా!

భార్య:- (దుఃఖంతో కుమిలిపోతూ- చంకలో చంటాడు, చిటికినవేలు పట్టుకొని

చిట్టాడు- ప్రవేశించి)
విన్నారా చిన్ని బాబుల
ఆకలి ఆర్తనాదాలు
కన్నారా కన్నయ్యల
కడుపుకోత కడగండ్లు
కోకొమ్మని కోతితల్లి
చుట్టూ తిరుగుతూ సుఖంగాఉంటే
సంతసిస్తుంది సంతానాన్నిచూసి
ఇలా పిల్లల ఏడ్పులుచూసి
తల్లడిల్లే తల్లి బాధాగాధ

విన్నారా, కన్నారా

బాల్యమిత్రుడు- యదుచంద్రుడు,
భాగ్యవంతుడు- భగవంతుడు
ఉన్నాడన్నారు— ద్వారకలోన
కన్నారకని, తెలుపండి మన
దీనస్థితిని- మనదుఃస్థితిని

కుచేలుడు:- (సంతోషముతో)

నిజమే ఈదీనుణ్ణి
కరుణిస్తాడు కలవరంలేదు.
ఏమున్నది ఇవ్వగ కానుక
ఏమీలేని వారం గనుక

పిడికె డటుకులు నాకొంగున ముడివేయి
చంద్రునికి నూలి పోగల్లు చేస్తాయివేయి.

తుడుమకో కన్నీరు
ముడుమకో కురులు
వస్తాను వెళ్ళివస్తాను, వెలుగు
మంచిరోజులు వస్తాయి మనకు

(కుచేలుడు వెళ్ళినశబ్దం. పిల్లలరోదన అణిగిపోతుంది. క్రమంగా నిశ్శబ్దం కొన్ని సెకండ్లు.)

(ద్వారక- శ్రీకృష్ణుని అంతఃపురంలో అపర స్వర్గంలా ఘంటలు నినాదాలు- పరిచారికా బృందం గాజులగలు- ఆనందల సందోహం.)

**కుచేలుడు:-** (ఆనందంతో)

అదియే ద్వారక; భువిలో
న, దివిని విష్ణువుపగిది వనంగన్ పెలసెన్;
మదన జనకుండు, మిత్రుడు,
అదియే అరుదై కలిగెను అదృష్టమనినన్!

(హంసతూలికా తల్పంపై పవ్వళించిన కృష్ణుకుండగా పరిచారికాగణం వింజామరలు వీస్తుండగా, జయజయ నినాదాలు వినవస్తాయి.)

**భక్తులు:-** జయము యదువంశ సుధాంబుధి సోమా!
జయము శత్రుభంజన రణరంగ భీమా!
జయము శారద నీరదాకారా!
జయము దీనజన కరుణాకరా!

**కృష్ణుడు:-** (చేలాంచల శబ్దంతో, తల్పం దిగి ఎదురేగి)

ఓహోహో నాబాల్యమిత్రుడు!
ఆహాహా ఆనందం, నాకుచేలుడు!
రావోయి ప్రియసఖుడా!
కొనుమోయి పాద్యమూ!
సుఖులేకదా సుతులు!
నీ శ్రీమతి, చుట్టాలు!

(తీసుకొనిపోయి హంసతూలికా తల్పంపైనే కూర్చుండబెడ్తాడు. ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయిపోతాడు కుచేలుడు.)

ఏదీ నాకోసం ఏమి తెచ్చావు?
నీకొంగున అటుకులు తెచ్చావు!
ఎంత రుచిమంతములు!
మన బాల్య స్నేహముల్లా!

అద్భుతం
ఆనందం !

కుచేలుడు:- (ఆనందంతో)
ఇది ద్వారకా! వైకుంఠం!
నీవు కృష్ణుడవా! విష్ణువే!
నిన్నుచూడ కన్నులకు ఫలం!
నిన్నుగన నా జన్మ సఫలం!

కృష్ణుడు:- నీరాక ఫలవంతం!
నీయిల్లు బంగారం!
(కుచేలుని సాగనంపుతాడు)

కుచేలుడు:- (దారిలో ఆలోచిస్తూ)

నేను వెళ్ళిన దెందుకు?
దాన సాధించిందేమిటి?
చితికిపోయిన నేను
పతికి ఏమిచెప్పను?

(ఇంటికి దగ్గరగా వస్తూండగా- ఇల్లు అద్భుతంగా, అనంత సంపన్నంగా, సందడిగా కనిపిస్తుంది. చెలికత్తెలతో సుఖ సంతోషాలతో అపర అప్సరసలా భార్య గోచరించి ఆహ్వానిస్తుంది కుచేలుని.)

స్వాగతం! స్వాగతం మీకు!
తీర్చుకోండి బడలిక
సమయానికి సహాయం
మిత్రుడంటే మీకృష్ణుడే !
కాదుకాదు ఆపదల తీర్చువాడే
ఆ దయామయుని చలువ
చూడండీ ఆనందం నిలువ
తీరిపోయాయి మనకష్టాలు
ఇక మనకి సంతానం చాలు

(విరామ సంగీతం)

డైరెక్టరు:- ఇది కుచేలోపాఖ్యానం. అధిక సంతానంతో ఆనాడే వారు అనుభవించిన కష్టాలు చూశారు గదా! ఇక చివరగా 'రెండు గులాబీలు' పాట వినండి.

రెండు మంచి గులాబీలు మిన్న- పది
రెండువేల గుడ్డి గులాబీలకన్న ॥రెండు॥

పచ్చటి పసందైన గులాబీలచెట్టు
ముచ్చటైన ముద్దుల గులాబీలచెట్టు
అచ్చపు సంసారానికి సంకేతం
అచ్చట ముచ్చట లానంద మనంతం ॥రెండు॥

పూచాయి రెండే రెండు గులాబీలు
వీచాయి పరిసరాలంత పరిమళాలు
కాచాయి చిరునవ్వుల వెన్నెలలు
తోచాయి ఆనందపు హరివిల్లులు ॥రెండు॥

గంపెడైనా గుడ్డి గులాబీలు
ఇంపుగ ఇంతైనలేవు సురభిళాలు

సొంపు గూర్చలేవే అందచందాలు
పెంపెక్క జేయ లేవేమి లాభాలు ॥రెండు॥

ఉన్నాయి గులాబీ ముళ్ల కష్టాలు
ఉంటాయి పెక్కు కడగండ్ల కన్నీళ్లు
తొలగిస్తాయి రెండు గులాబీలు
సొగసు, సుగంధాలనే ఔషధాలు ॥రెండు॥

డైరెక్టరు:- ఇంతవరకు ఓపికగా కుటుంబ సంక్షేమం గూర్చి కదంబ కార్యక్రమం విన్నారు. మీకిది సహకరిస్తే మా శ్రమ ఫలించినట్లే. సఫలం కావాలని ఆశిస్తున్నాము. మీ కందరికీ మా కృతజ్ఞతలు-

(రకరకాలుగా మాటలాడుకొంటూ వెళ్ళుతూన్న ప్రజల మాటలుశబ్దాలు— కార్యక్రమానికి సంబంధించిన సామాను సర్దుబాటు శబ్దం.)

సుందరం:- (వెళ్ళుతూంటాడు)

కృష్ణారావు:- ఒరే మిత్రమా! సుందరం! నీవు వచ్చావు? బాగుంది. చూశావుగా; కుచేల సంతానంవల్ల బాధలేమిటో.

సుంద:- ఏమిటిరా నీసొద! కుశల ప్రశ్నలకు బదులు కుచేలుని మాటలతో నీ శాప నార్థాలేమిటోయ్ కృష్ణా!

కృష్ణారావు:- అంతేర్రా! నావి శాపనార్థాలా! యధార్థంరా బాబు యధార్థం! మీ అమ్మ గారో, నాన్నగారో నీకు కుచేలరావని పెట్టవలసింది. సుందర్రావుగాదు. ఇది బాగాలేదు-

సుంద:- సరే. మింగ మెతుకు........ సామెతలాగా ఉంది నీధోరణి. ఏదో అలా అలా సాగదీస్తూ ఉన్నాము సంసారయాత్రను.

కృష్ణా:- అయిందేదో అయిందనీ, అంతా భగవంతుని దయఅనీ, మూర్ఖత్వానికి లోనై బాధలు తెచ్చుకోవడంతప్ప, హేతుబద్ధంగా ఆలోచించవేం? కొడుకో కొడుకో అంటున్నావు. కూతురైతేనేమి? కొడుకైతేనేమి? రోజులు మారాయి. చదువుకొన్నవాడివి. పుట్టబోయే సంతానం ఐదోదిగదా?

సుంద:- నిజమే! నాకు తెలీకకాదు. కాని మాఅమ్మ మాటను కాదవలేక పోతున్నానోయ్. ఆమెకేమో పూర్వసంప్రదాయాలంటే పిచ్చి. అమ్మను కాదనేశక్తి నాకులేదు. ఆమెకు సర్వస్వమూనేనే. నేనొక్కణ్ణే మిగిలాను. పున్నామ నరకంనుంచి తప్పించే వాడు పుత్రుడంట! సంతాన తంతువును తెంచకూడదంట!'ఇది అమ్మపట్టు'దల. నీచెల్లాయి గోలపెడుతూనే ఉంది. నేనే అమ్మమాట కాదవలేక. శ్రీమతిమాట పట్టించుకోక ఇంటిలో అధ జనాభా పెంచుతున్నాను. నామూర్ఖత్వానికి నాకే సిగ్గుగా ఉందోయ్.

కృష్ణా:- అయినా సందర్భాను సారంగా నడచుకోకపోతే ప్రయోజన మేమి చెప్పు? చదువుకొన్నవాడివి. లోకమంతా జీతంకన్నా గీతంమీద బతుకుతున్న రోజులివి. నీవేమో నిజాయితీ పరుడవయ్యే. జీతంమీదే బతకడం కష్టమని నాకు తెలుసు.

సుంద:- వాస్తవం. అదినాకు చేతగానిపని. పస్తు అయినా ఉంటాగానీ లంచగొండిని కాలేను. నాకంటే చిన్న ఉద్యోగాలు చేసుకొనే వాళ్ళే బాగా బతుకుతున్నారు. అయినా నాకు బాధలేదు.

కృష్ణా:- అందుకు నిన్ను మెచ్చుకోవలసిందేగాని జనాభా పెంచితే ఎలాగోయ్? చిన్న కుటుంబం కోసం ఇన్ని చిట్కాలున్న ఈ ఆధునిక యుగంలో నీవిలా బాధ్యతా రహిత పౌరుడు కావటం బాగాలేదు.

సుంద:- నిజమే! చాలీచాలని జీతం, గంపెడు సంతానం, అప్పులు, ఈసారితో తేలిపోవాలి. ఏదైనాసరే!

కృష్ణా:- లేకపోతే మనమే ఇలా అయితే పామరప్రజల మాటేమిటి?

సుంద:- కృష్ణారావు! ఇక తిట్టకురా నాయనా? చెంపలేసు కొంటున్నాను. (శపథం) నీమాట జవదాటను.

కృష్ణా:- నాతో ఇలాగే అంటావు. ఇంటికిపోయి అమ్మదగ్గర పిల్లిలా ఉంటావు.

సుంద:- అమ్మఎంతో అల్లారుముద్దుగా పెంచింది. తనకు లేకపోయినా నన్ను కాపాడింది, ఆ ఋణం ఎలాతీర్చుకోనూ?

కృష్ణా:- అయితే ఇదా మార్గం!

సుంద:- ఏమిచేయను? అమ్మమనసుకు బాధకలిగించలేను. కానీ ఈసారి నీచెల్లి, ప్రసవంతో తేల్చేస్తాను.

కృష్ణా:- అబ్బా! ఇప్పటికైనా దృఢ నిశ్చయానికి వచ్చావు. సంతోషం.

సుంద:- ఇప్పుడుగాదు. అప్పుడే సంతోషిద్దువుగాని.

కృష్ణా:- ఓరేయ్! సుందరం! ఒక విషయం గుర్తుపెట్టుకో! ఈ నీమిత్రుడు కృష్ణారావు ఉన్నసంగతి. ఏది అవసరమైనా మరచిపోవుగదా!

సుంద:- ఎలా మరచిపోగలనురా? మనబాల్యమైత్రిని!

కృష్ణా:- ఏమీలేదు నీమొహానికి మొహమాట మెక్కువగదా?

సుంద:- సరేలేవోయ్! బిజినెస్ వదలి ఇలా రావడమే విశేషం. ఎంత నష్టం వచ్చిందో ఇంతలో!

కృష్ణా:- చూసుకొనేవాళ్ళు ఉన్నార్లేవోయ్! చింతలేదు. వస్తా! గుడ్‌లక్.

సుంద:- ఆఁ ఆఁ ........ అలాగే

(ఇద్దరు విడిపోయిన శబ్దం)

## రంగం - 2

(సుందరం ఇల్లు)

అమ్మ:- భజగోవిందం భజగోవిందం మూఢమతే (పాడుతూ ఉంటుంది)

(సుందరం రాక.)

సుంద:- (అడుగుల చప్పుడు)

అమ్మ:- ఏమిరా! నాయనా సుందరం! ఇంత ఆలస్యమేమిటి?

సుంద:- (మాటలాడడు.)

అమ్మ:- ఏమిట్రా నాయనా మాట్లాడవేమిట్రి

భార్య:- ఏమిటండీ! తలనొప్పిగా ఉందా?

సుంద:- అది మామూలు జబ్బేగా క్షమా?

క్షమ:- ఎందుకండీ అంతకోపం!

సుంద:- ఏమీలేదు. ఈకుటుంబం గురించే!

క్షమ:- అసలు సంగతేమిటో చెప్పండి? ఇంట్లో అడుగుపెట్టేదే ఆలస్యంగా. ఇంటిల్లి పాదిని గురించిన కుశలప్రశ్నలయితే గాని తక్కిన కార్యక్రమాలుం డేవి కాదుకదా! ఈరోజు వింతగా ఉన్నారు? విచిత్రంగా మాటలాడుతున్నారు!

అమ్మ:- మనసుకేమిబాధ కలిగిందో మానాయనకి!

సుంద:- ఉన్నది ఒకటే బాధ. సంసారయాత్ర. ఆడపిల్లల తండ్రిననే సార్థకమైన పేరు.

అమ్మ:- బాబు సుందరం! అంతా భగవదిచ్ఛ! నీవునేనూ, మీఆవిడా ఏమిచేయగలం? మానవమాత్రులం! నారుపోసినవాడు నీరుపోయకపోడు!

సుంద:- ఇలా చెప్పబట్టేనమ్మా నన్నిలా తయారుచేశావు. దీని కంతటికీ నీ పూర్వ సంప్రదాయాలు, నమ్మకాలు అని ఇప్పుడు నేను తెలుసుకొంటున్నాను.

క్షమ:- ఎందుకండీ అలా అత్తగారిమీద విరుచుక పడతారు? అయిందేదో అయి పోయింది. ఇకనైనా జాగ్రత్త పడితే మంచిదండీ!

సుంద:- ఆసంగతే చెప్పు మీ అత్తయ్యకి! వయసు పెద్దదయ్యేకొద్దీ ఇలాంటి పెడ బుద్ధులెందుకో! అమ్మా! నన్నిలా పెంచే ఇలా చెడగొట్టావమ్మా!

క్షమ:- ఎందుకండి అలా కసురుమంటారు అత్తగారిని!

అమ్మ:- అనరా నాయనా! అను!

సుంద:- కాకపోతే మరేం చేయమంటావు? చూడు సంతానం సంగతి! ఆc అయినా ఎలా ఉంది పాపలకి?

క్షమ:- చిట్టికి జ్వరం తగ్గింది. చంటికి జలుబు నెమ్మదిస్తూంది. ముగ్గురు పిల్లలు నిద్రపోతున్నారు.

సుంద:- అంతవరకు సంతోషమే!

క్షమ:- పెద్దమ్మాయి అదుగో ఎదురుగుంటా. బాపమీద ఎంత బుద్ధిగా చదువుతూ ఉందో మన రామాయణం వింటూ.

సుంద:- అదేనయం. అదే నాకొడుకు.

క్రాంతి:- (దగ్గరకువచ్చి) నాన్నా!

సుంద:- ఏమ్మా! క్రాంతీ!

క్రాంతి:- వారంలో కాలేజీఫీజు కట్టాలినాన్నా!

సుంద:- అవునమ్మా! నీకాలేజీఫీజు: చెల్లెళ్ల స్కూలుఫీజు, ఆవెనుక అమ్మ పురుడు, అంతా మోయాలి తప్పుతుందా తల్లీ!

క్షమ:- ఇల్లు గుల్లయింది నామూలంగా!

సుంద:- కాదు నామూలంగా! నీకు ఒక్క పసుపుతాడు మాత్రం మిగిల్చిన మగ ధీరుణ్ణి నేను!

అమ్మ:- అదేమిట్రా! కష్టాలు మనిషికిగాక మానుకొస్తాయా!

సుంద:- అమ్మా! ఇదంతా నీమూలంగానే. మనవడో, మనవడో అని గోలపెట్టబట్టేగా మనం ముగ్గురితోపాటు నలుగురు, రేపొద్దున....

అమ్మ:- అదేమిట్రా! 'శుభం బల్కరా' పామెతలాగా? తప్పకుండా నేను మనవణ్ణి ఈసారి ఎత్తుకుంటాను. తప్పదు. నా అంతరాత్మ చెబుతూంది.

సుంద:- ఆఁ చెబుతూనే ఉంది. ఇది ఖచో సంతానం చూడకపోతామా!

క్షమ:- అయినా రాబోయే దానికి విచారం దేనికండీ! ఏమో అత్తగారి నోటిమాటతో మగ నలుస్తే కలుగొచ్చు!

సుంద:- ఇంతకాలమూ చూశాంగా! నీపిచ్చిగాని!

క్రాంతి:- నాన్నా ఎందుకింత గొడవ? ఏద్దైతేనేమీ? మీకు నేనేమీ భారంకాను. కట్నమంటారా? నేను పెళ్లిచేసుకోను. మీకు కష్టాల్లేకుండా అంతో ఇంతో సంపాదించి కుటుంబ భారం నేనే మోస్తాను. సరేనా?

క్షమ:- చూశారా అండీ! నాతల్లి మాటచాలు!

సుంద:- ఆఁ చూశానుగానీ సమాజముందే?

క్రాంతి:- సమాజమంటే?

అమ్మ:- ఎంతమాటే! నీవు ఉద్యోగం చేస్తూ ఊరేగుతావా? కాలం మారింది?

క్రాంతి:- నాయనమ్మా! సరిగ్గా చెప్పావు. కాలంమారింది. స్త్రీ, పురుష భేదంలేదు. పురుషుడే కష్టపడి సంపాదించాలనీ, స్త్రీ వంటింటికే అంకితమై, సంతానాన్ని ప్రసాదించాలనీలేదు. మనోధైర్యం కావాలి. ఆనాడే ఈసమాజం, ఈదేశం బాగుపడుతుంది.

అమ్మ:- ఓసోసీ! ఈ చదువువల్ల నేర్చుకుంది ఇదన్నమాట.

క్షమ:- క్రాంతి అన్నమాటల్లో సత్యముందీ అత్తయ్యా!

అమ్మ:- నువ్వూ దాన్ని వెనకేసుకొస్తున్నావ సే కోడలా?

సుంద:- కాక తప్పేమిటమ్మా! క్రాంతి తప్పకుండా చెప్పినమాట దక్కించు కొంటుంది. నాబంగారుతల్లి !

అమ్మ:- సరే నాయనా! మీరంతా ఒకటైనప్పుడు నేనేమి చేయగలను ముసలిదాన్ని!

క్షమ:- ఇదంతా అలా ఉండనీగానీ, ఇప్పటికే ఆలస్యమైంది. అమ్మా! క్రాంతీ! భోజనానికి సిద్ధం చేయమ్మా! రండి కాళ్లుకడుక్కుందురుగాని!

అమ్మ:- నిజమే! మా నాయన పొద్దుననగాతిని ఆఫీసుకెళ్ళినవాడు ఎంత ఆకలి గొన్నాడో! లేవరా నాయనా!

సుంద:- సరే!

(అందరు భోజనాలకు సిద్ధమవుతూండగా పాత్రల శబ్దాలు)

రంగం - 3

(సుందరం ఇల్లు)

సుందరం :- క్షమా ! జాగ్రత్త. నేను మా ఆఫీసర్‌తోపాటు కేంపు వెళ్లుతున్నాను రెండు మూడు రోజులు పట్టవచ్చు. ఈ కార్యక్రమమేమో ముందే ఫిక్స్ అయింది. ఈ చివరి నిమిషంలో నేను రాలేనంటే కష్టం.

క్షమ :- ఏమీ ఫరవాలేదు. మీరు వెళ్ళిరండి.

సుంద ;- నీవలాగే అంటావు. క్రాంతీ ! నీవీరెండు రోజులు కాలేజి మానేసి అమ్మ దగ్గరే ఉండాలమ్మా !

క్రాంతి:- అలాగే నాన్నా! తప్పకుండా, మీరేమీ భయపడనక్కరలేదు. సుఖంగా వెళ్లి రండి.

సుంద:- అమ్మా ! నీవుగూడా కోడల్ని జాగ్రత్తగా చూచుకోవాలి.

అమ్మా:- నీవు చెప్పాల్రా! నాకు మనవణ్ణి ఎత్తుకోవాలన్న కోరిక ఎంత తీవ్రంగా ఉందో ! తెలుసా ! ముసలిదాన్ని అయిపోయానుగానీ నేనే చూచుకొనే దాన్నేగా ?

సుందః- నీవు ఇంటివద్ద పెద్దదిక్కు ఉంటే చాలమ్మా!

క్షమ:- చాల్లేండి అప్పగింతలు. ఎందుకంత కంగారుపడిపోతారు?

సుంద:— ఏమీ లేదు క్షమా ! నీ ఆరోగ్యం అంతలంతలు. చాలా నీరసంగా ఉన్నావు.

క్షమ:- ఏమీ పరవాలేదు! వెళ్ళిరండి సుఖంగా ! కొత్త ఏమీకాదుగా! మామూలై పోయింది!

సుంద :- మామూలైనా నేను ఉండనే అని ఆలోచిస్తున్నాను.

క్షమ :- అక్కర్లేదు, మీ కంగారు. మీరు, కేంపు నుంచి ముందే తిరిగి వస్తారనే నమ్మకం నాకుంది.

క్రాంతి :- అయినా మీరేమి చింతించే పనిలేదు, నేనుండగా మీరున్నట్లే నాన్నా!

సుంద :— అవునమ్మా! అదే నా విశ్వాసం. సాధైర్యమూను. నే వెళ్ళి వస్తాను

(వెళ్ళిపోవటం)

(విరామ సంగీతం)

క్షమా :- అమ్మా! క్రాంతీ ! ఇలారామ్మా

క్రాంతి:- ఆఁ ! వంటికి పాలుపడుతున్నానమ్మా! వస్తున్నా (వచ్చి) ఏమిటమ్మా ! నీరసంగా ఉందా ?

క్షమ - నీరసమేమిటి ?

క్రాంతి:- మరేమిటి ?

క్షమ - ఇంకాఏమిటేమిటి ? రిక్షా కట్టించుకొనిరా ! మనం వెంటనే ఆస్పత్రికి వెళ్లాలి !

క్రాంతి - అలాగేనమ్మా! చిటికెలో వస్తాను. నాయనమ్మా! వంట చేసి దిగపెడుతుంది. ఇదిగో తీసుకో (అని ఇస్తుండగా వంటి ఏడుపు)

అమ్మా:- నాఅమ్మో! నాఅమ్మో! (అంటూ సముదాయిస్తూ ఉంటుంది)

క్షమ - (సన్నగా మూలుగుతూ ఉంటుంది.)

అమ్మ:- కోడలా! బాధగా ఉందా! సుందరం లేకపోయే సమయానికి!

క్రాంతి - (రిక్షాతోవచ్చి) రామ్మా! రిక్షావచ్చింది, ఆఁ ఆఁ జాగ్రత్తగా ఎక్కు, అబ్బాయ్ జాగ్రత్తగాపోనీ!

రిక్షా:- అలానే అమ్మాయిగారూ! (రిక్షాపెళ్ళిపోతున్న శబ్దం) (చిన్నపిల్ల రోదన, ముసలమ్మ సముదాయింపు.)

అమ్మ:- భగవంతుడా! శ్రీనివాసా! బాబును ప్రసాదించు తండ్రి! ఈ ముసలి, పసి దాని కోరికను మన్నించవా?

(విరామ సంగీతం)

క్రాంతి:- (ఆస్పత్రిలో ఆదుర్దాగా) ఏమిటి సిస్టర్! ఎలా ఉంది మాఅమ్మకి!

నర్సు:- తల్లీ పిల్లా క్షేమం. నీకుతోడు చెల్లి వచ్చింది.

క్రాంతి:- (కంగారుగా) ఆ! ఆడపిల్లేనా?

నర్సు:- ఏం?

క్రాంతి:- (సర్దుకొంటూ): ఏమీలేదు! ఏమీలేదు! అమ్మను, పాపను చూడొచ్చా సిస్టర్?

నర్సు:- తప్పకుండా (వెళ్ళిపోతుంది.)

క్రాంతి:- (లోనికిపోయి,) దిక్కుమొహంతో అమ్మను చూసింది. చెక్కిళ్ళపై కన్నీరు ఆపుకోలేక అమ్మా! అంది.)

క్షమ:- (నీరసంగా) ఏమిటమ్మా! తప్పుగదా! చింత ఎందుకు?

నర్సు:- డాక్టరు వస్తున్నారు.

డాక్టరు:- (వచ్చి) చూడమ్మాయి! మీఅమ్మగారిని రేపు డిశ్చార్జి చేస్తాము. వడకల కొరతే కారణం. అయితే కొన్ని మందులు, టానిక్కులు రాసిస్తాను. కాని నేను చెప్పిన రీతిలో ఇంటిలోనే వాడుతూ రావాలి. ఇది ఐదో కానుపు అంటున్నారు గనుక టూబెక్టమీ ఆపరేషన్ చేసేవాళ్లం పిల్లలు కలగకుండా! కానీ చాలా నీరసంగా ఉన్నారు మీఅమ్మగారు! జాగ్రత్తగా చూసుకోవాలి!

క్రాంతి:- అలాగే డాక్టరుగారూ!

డాక్టరు:- రేపు మందులు, టానిక్కులు రాసిస్తాను. (డాక్టరు వెళ్ళిన శబ్దం.)

క్షమ:- అమ్మా! క్రాంతీ! టానిక్కులకి, మందులకి డబ్బులేదే! అయినా దీని కంతటికి డబ్బులెక్కడివే! నాన్నగారు ఇచ్చారా!

క్రాంతి:- లేదమ్మా! నాకు కాలేజీఫీజుకని ఇచ్చారుగా.

క్షమ:- అయితే కాలేజీ ఫీజు కట్టలేదా!

క్రాంతి:- ఇంకా వ్యవధి ఇచ్చారమ్మా! అందువల్ల ఆడబ్బు ఇలా ఉపయోగించాను.

క్షమ:- నాతల్లీ! నీకు దక్షత ఉందమ్మా! మగసంతానం లేదన్న భయం నాకు తీరి పోయిందమ్మా! క్రాంతీ!

(సంతోషించింది తల్లి.) (నిశ్శబ్దం.)

రంగం - 4

(సుందరం ఇల్లు)

సుందరం:- (ప్రవేశించి) : అమ్మా! క్రాంతీ! (అందరూ ఒక్కసారే గొల్లు మంటారు)

సుంద:- ఏమైందమ్మా!

అమ:- ఏమీలేదు నాయనా! నామూర్ఖతా, పట్టుదలా, కారణములేని నమ్మకమూ దీని కంతా హేతువు. నాకంత పుణ్యమూనా? నాకు మరో మనవరాలు పుట్టింది. అంతే.

క్రాంతి:- (బిక్క మొహంతో చిట్టిని, చంటిని సముదాయిస్తూంది.)

క్షమ:- (పాప పక్కలో మంచంమీద చింతతో భర్తకేసి చూడలేక పోయింది.)

సుంద:- కాదు లేవమ్మా! నాఅవివేకం. నీమాట కాదవలేక ఇంతకాలమూ ఇలా ప్రవర్తించబట్టే ఈసంసారానికి సుఖ సంతోషాలు, శాంతి, హాయి లేకుండా చేశాను. దీనికి పరిష్కారముంది. ఈ సంసారనౌకను ఇకిమంచి అయినా కష్టాల అలల ఒడిదుడుకులకు లోనుకాకుండా కాపాడవలసిన బాధ్యత నాపై ఉంది. అయినా క్రాంతీ! దీనికంతటికీ డబ్బు ఎలా చేశావమ్మా!

క్రాంతి:- ఎందుకునాన్నా! కాలేజీకి సెలవు పెట్టమన్నావుగా! దానికితోడు ఫీజు కట్టడానికి గడువిచ్చారు. ఆ డబ్బును ఇలా ఉపయోగించాను. నేనేమీ తప్పు చేయలేదు నాన్నా!

సుంద:- ఔనమ్మా! నాకుతెలుసు నీసామర్థ్యం! ఎందుకో మీ నాయనమ్మ మగపిల్లను మగపిల్లను అంటూ పోరింది. చెప్పమ్మా నీ బాకచక్యాన్నిగూర్చి! అలా అడిగేతల్లి!-

అమ్మ:- నన్ను నిందించరా నాయనా! అమ్మాయిని అలా పొగడక! నాదే పొరపాటు.

క్షమ:- చాల్లే అత్తయ్యా! ఏమ్మాటలు అవి? అమ్మా క్రాంతీ! నాన్నగారికి భోజనం సంగతి చూడమ్మా!

సుంద:- నేను భోజనం ముగించే వచ్చానుగాని, ఎలావుంది క్షమా!

క్షమ:- మామూలే. కంగారేమీలేదు. కాకపోతే నీరసంగా ఉంది. అందుకు డాక్టరు మందులు, టానిక్కులు రాసిచ్చారు. అమ్మాయి డబ్బుతో అన్ని సర్దుబాటు చేసింది. చింతేమీలేదు.

సుంద:- చాలా సంతోషం! నేను కేంపులోఉన్నా అమ్మాయ్ అన్నీ చూసుకొంది. తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొంది. అదే మన కొడుకని గర్విస్తున్నానుక్షమా.

క్షమ:- నిజమే! క్రాంతి ఏలోటూ రానీకుండా చూసింది. నాకే ఆపరేషన్ చేస్తా మన్నారుగానీ, నీరసంగా ఉన్నానని, టానిక్కులు వాడాక రమ్మన్నారు.

సుంద: సరేలే ఆవిషయం మరచిపో. ఇదంతా ఓపీడకల.

క్షమ:- ఇంటిలో అన్ని నిండుకొన్నాయి. నీ మిత్రులు కృష్ణారావుగారి కొట్టుకు వెళ్లరాకపోయా ా!

సుంద:- సరేలే. తరువాత వెడతాను. అమ్మా! మనవడిని ఎత్తుకోవమ్మా!

అమ్మ:- తిట్టగా నాయనా! ఇందాక చెప్పానుగా తప్పయిందని

సుంద;- చేతులుగాలేక.... పామెతలాఉంది నీధోరణి.

అమ్మ:- కానున్నది కాకమానదు.

సుంద:- అదుగోమళ్లీ! అదేతీరు.

క్షమ:- పోనీండి అత్తయ్య ఏమిచేశారని?

క్రాంతి:- ఇంకా ఎందుకునాన్నా కోపం?

సుంద:- అందరూ అలా అంటే ఇక నేనేమంటాను. ఒక విషయం, రేపు ఆఫీసుకు వెళ్లడంలేదు.

క్షమ: ఎందుకని?

సుంద :- సెలవులున్నాయిగా ? మురిగిపోతున్నాయి. రేపు సెలవు పెడతాను.

క్షమ:- ఎన్నాళ్ళకు మీ నోటి నుంచి ఈ మంచి మాటవిన్నానండీ (నవ్వుతుంది.)

సుంద :- అవునులేవే! నాఅతుకుల. గతుకుల బతుకంటే నీకూ నవ్వే! నా ముక్కు-సూటి తనమే నన్నుమూర్ఖుణ్ణి చేసింది.

క్షమ:- (గంభీరంగా) ఏమీఫరవాలేదు లెండి. ఎవరికి తలవంచేపని మీరేమి చేయలేదు.

సుంద·- నిజమే నీవు చెప్పింది. కానీ వచ్చే అల్లుళ్ల ముందు తప్ప అను.

క్రాంతి:- నాన్నా! ఆమాట అనకండి. మీకు తలవంపులు తెచ్చేపని చేయను. పైగా అలాంటి అల్లుళ్ల మన ఇంటిగడప తొక్కేపని లేదు. అందుకూహించేను.

సుంద:- అమ్మా క్రాంతీ! నీ వన్నంతపని చేస్తావమ్మా! నీ మాట నిలబెట్టుకోటావని నాకు తెలుసమ్మా అది ఈనాడే నిరూపించావు. ఇక మిగిలింది నా బాధ్యత. నెరవేరుస్తాను.

అమ్మ:- నాయనా! సంసారమన్నాక వెలుగునీడల్లా సుఖాలెంత కష్టాలుంటాయి. మబ్బులు వీడాక వెలుగు వెల్లువ వస్తుంది.

సుంద:- ఆ ఆశతోనే బతుకు పడవకు చుక్కాని పట్టి సంసార సముద్రం ఈదుతున్నానమ్మా !

(అంకానికశ్చట్టం)

## రంగం - 5

(బజారు)

సుందరం:- రిక్షా అబ్బాయ్! జాగ్రత్తగాపోనీ కుదుపులు, మెల్లగా, అలాకృష్ణారావు కొట్టుమీదుగా పోనీ.

రిక్షావాలా:- అలాగేనండీ (రిక్షాశబ్దం, బెల్లు, బ్రేకు)

సుంద:- ఆఁ (ఇక్కడే ఆపు నిముషం, కృష్ణారావు !

కృష్ణారావు :- (బయటికివచ్చి) ఏమిబోయ్ మహారాజులా రిక్షా దిగకుండానే !

సుంద :- ఈరోజుకంతేలే మరే! రాత్రి చెప్పడం మరచాపోయ్, ఇంటిలో వెధవాలన్నీ నిండుకున్నాయని.

కృష్ణా :- సరే నీమోహం. అంతజ్ఞానం గూడానా! ఏ ప్రమాదం లేదుకే !

సుంద:- అంటే ఇంటిల్లి పాదీ మాడమంటావా! అప్పుంటే తీరుస్తాను లేవోయ్! ఇదిగోడబ్బు (ఇవ్వబోతాడు)

కృష్ణా:- ఉంచవోయ్! దేనికైనా ఉపయోగపడుతుంది.

సుంద:- అంటే నాకర్థం కావడం లేదు. నీ ఉద్దేశ మేమిటో?

కృష్ణా :- ఏమీలేదులేవోయ్! ఉదయమే సరుకులన్నీ ఇల్లు చేరాయి. నీవు ఇంటికెళ్లి సుఖంగా నాలుగురోజులపాటు గడుపు. అయినా నాకు తెలియకడుగుతాను. అంతడబ్బు! ఈ ఊళ్లో ఈ కృష్ణారావు గాక ఎవడు అప్పు ఇచ్చాడా అని ఆశ్చర్యంగా ఉంది! మహారాజులా రిక్షా దిగనంటున్నావయ్యే! ఏమిటి విశేషం?

సుంద:- ఈయనేనండీ ధర్మదాత!

కృష్ణా:- నాలాంటి మిత్రులు ఇంకా ఉన్నారానీకు? ఏదీ ఒక్క పేరు!

సుంద:- ఏం?లోకం గొడ్డు బోయిందా?

కృష్ణా:- వింతగా ఉంటే నీకథ.

సుంద:- ఆస్పత్రిలో ఇచ్చారోయి!

కృష్ణా:- ఏమిటీ?

సుంద:- ఔను, నీసాక్షిగా!

కృష్ణా- అంటే, నీవు!....

సుంద:- ఔనోయ్! ఆపరేషన్ చేయించుకొన్నాను.

కృష్ణా:- ఓహో! అదా సంగతి! అలాచెప్పు! ఇప్పటికి మాచెల్లికి కలి విరగడైందండి. ఇది ఎప్పుడో చేయవలసినపని. పోనీ ఇన్నాళ్ళకైనా చేశావు. సంతోషం వెళ్ళిరా! నిన్ను నేనెంతో మెచ్చుకొంటున్నాను. తరువాత అన్నీ మాట్లాడుకోవచ్చు ఇంటికి పద.

సుంద:- థాంక్స్‌రా మిత్రమా!

కృష్ణా:- నాకెందుకు మధ్యన?

సుంద:- నీవే లేకపోతే.........

కృష్ణా: ఏడిశావులే! నాకోడీ, కుంపటిలేకపోతే [illegible] వెల్లవా [illegible] హార్యం
ఓ ముసలమ్మ

సుంద: అదికాదు, మనమైత్రి.

కృష్ణా: సరేలే. నీవింటికివెళ్ళి చెల్లికి, ఇంటిల్లిపాదికి ఈ [illegible] చెప్పు.

సుంద: అలాగే వస్తాను. అబ్బాయ్ పోపేరిక్షా! (రిక్షా [illegible] శబ్దం.)

(విరామ సంగీతం.)

(సుందరం ఇల్లు)

సుంద: రిక్షా! ఇక్కడాపు ఇదిగోడబ్బు. (రిక్షావెళ్ళిన శబ్దం.)

(ఇంటిలోకి మెల్లగా ప్రవేశిస్తూండగా అందరూ ఆశ్చర్యంగా చూస్తూ [illegible])

సుంద: క్రాంతీ! కాస్త మంచం వాల్చమ్మా! పడుకుంటాను (క్రాంతి [illegible] మంచంవాల్చి
పక్క వేసింది. సుందరం పడుకుంటుండగా)

క్షమ: ఏమైందండీ! ఎందుకలా ఉన్నారు?

అమ్మ: ఏమిటో! చెప్పరా బాబూ!

క్రాంతి: ఏమిటి నాన్నవిషయం!

సుంద: ఏమీలేదమ్మా! క్షమా! నేనూ రాత్రి కృష్ణాగాడూను [illegible]
మాట్లాడుకొన్నాము. కానీ సరుకు విషయం చెప్పలేకేను.

క్షమ: అయినా మీరు వెళ్లగానే కొట్టబ్బాయ్ సరుకులిచ్చి [illegible].

సుంద: వస్తూ అటువెళ్ళాను. వాడే చెప్పాడు.

క్షమ: చూశావా! నాకన్నయ్య లేకపోయినా అన్నయ్యలా [illegible].

సుంద: మా స్నేహమటువంటిదోయ్! నేను కుచేలుడైతే వాడేమో [illegible] కృష్ణుడు.
కృష్ణుడు కుచేలుని అటుకులైనా తిన్నాడు. నామిత్రుడు [illegible]
కోరకనే ఇచ్చాడు. చూశావా తేడా?

అమ్మ:- మీ స్నేహమలాంటిది. బాబూ!

క్రాంతి: నాన్న! మామయ్యలాంటి మంచివాళ్లుంటే ఈదేశానికి ఈదౌర్భాగ్యం ఉంటుందా!

సుంద: ఔనమ్మా! ఇది మన అదృష్టం.

క్షమ: నిజమే! అదృష్టమే! కానీ ఎప్పుడో ఆపరేషన్ చేయించుకోమని పోరితే విన్నారు కారు.

సుంద: ఇప్పటికి బుద్ధి వచ్చింది. నీమాటను ఈరోజు పాటించాను క్షమా!

క్షమ: నిజంగానా! అదేనా! మీనీరసానికి కారణం! చాలా సంతోషమండీ!

అమ్మ: కడగండ్ల కడలిలో అలల ఒడిదుడుకులలో సాగిపోతూఉన్న సంసారనౌక ఈవిధంగా సుఖంగా ఒడ్డు చేరుకొంది.

సుంద: అమ్మా! నీవూ సంతోషిస్తున్నావా!

అమ్మ: తప్పకుండా బాబూ! మీ సుఖమే నాసుఖం. నా మూర్ఖపు పట్టుదలే ఇంతపని చేసింది.

క్షమ. అయినా ఇప్పుడే ఏమైంది?

అమ్మ: ఇంకా ఏమిటే?

క్షమ: నీ మనవరాండ్ర నందర్నీ ఇంటివాళ్లను చేయాలిగా, మీరోజులుగావు? అత్తయ్యా!

సుంద: కట్నాలుకోరే అల్లుళ్లు మనకక్కరలేదు.

క్షమ: అని మనం అనుకొంటే సరిపోతుందా! వచ్చేవాళ్లు అనుకోవాలి.

సుంద: నిజమే! సమాజమే అలా ఉంది కట్నం తీసుకోవడం స్టేటస్‌గా భావిస్తున్నారు. లేకపోతే వాడికేదో లోపమేమో అన్నట్టు చూస్తున్నారు. ఇదీ లోకం తీరు.

క్రాంతి: నాన్న! ఇది ఎంతోకాలం కొనసాగదు. పూర్వం కన్యాశుల్కం సమాజాన్ని పీడిస్తూ ఉండేది. ఇప్పుడు వరకట్నపిశాచం ఆవహిస్తూంది జనాన్ని. అందరి మనసులలోనా మార్పువస్తే ఈ పిశాచం వైదొలుగుతుంది. కానీ ఇది ఇరువైపులా ఆలోచించ వలసిన విషయం. ఇచ్చేవాళ్లు, తీసుకొనేవాళ్లు, ముఖ్యంగా ఆడపిల్లలు ఈ దురాచారాన్ని ఎదిరించాలి. అప్పుడే సంఘం బాగు పడుతుంది. నామట్టుకు నాకు కట్నం పుచ్చుకునే భర్త అక్కరలేదు. అలాంటి వ్యక్తిని పెళ్లిచేసుకోను. అంతకంటే పెళ్లి మానేస్తాను.

సుంద: అమ్మా క్రాంతీ! నీదృఢ విశ్వాసానికి మెచ్చుకుంటున్నాను. నాయనమ్మ ఏదో మనవడు మనవడు అంటూ ఉండేది. మా మగాళ్లకు బుద్ధి చెప్పేలా మాట్లాడావు. కానీ మాటలంత సులభం కాదమ్మా బతకటం.

క్రాంతి: ఏమిటి నాన్నా! మీరు డీలా పడిపోతున్నారు. అందరూ ఇలానే పడుకుంటే సంఘమంటే ఏమిటినాన్నా! మనుష్యులేకదా!

క్షమ: నాన్నగారి మాటలు వాస్తవం తల్లీ! లోకులు కాకులు.

అమ్మ: నీ వుండవే కోడలా. మనవరాలుకాదదీ. నామనవడే. ఎంచక్కా చెప్పింది. నాయమ్మమాటేచాలు. తప్పకుండా మాట నిలబెట్టుకొంటుంది. ఎంతైనా చదువుకొన్నపిల్ల.

సుంద: అమ్మా! నీలోనే ఇంతమార్పు వచ్చిందంటే సమాజం మారకుండా పోదని పిస్తోంది. మబ్బులు విడిపోయి వెలుగులు ప్రసరిస్తాయనిపిస్తోంది. నవ సమాజం నిర్మాణం కాబోతూందనిపిస్తూంది. మంచిది ఆశిస్తాం,

క్రాంతి: నాన్నా! ఆ గుండెధైర్యం నాకుంది. బాగా చదివి, నామాట నిలబెట్టు కొంటాను.

క్షమ: అప్పుడే మన కుటుంబ గౌరవం, తద్వారా సమాజం, గౌరవాలు పెరుగు తాయి.

సుంద: వాకా నమ్మకముందమ్మా క్రాంతీ! ఇదిగోనమ్మా డబ్బు! కాలేజీ ఫీజు కట్టి బాగా చదివి బుద్ధిమంతురాలు కావాలి.

అమ్మ: బాబూ! తథాస్తు! ఇప్పటికైనా చక్కటి సమాజం కనుచూపుదూరం మేరలో కనిపిస్తుంది.

సుంద: అమ్మమాట నిజం కావాలి. అందరూ ఆనందించాలి. శుభం!

క్షమ: భోజనం చేయండి!

సుంద: సంతోష పతంపరలతో కడుపు నిండిపోయింది: దేశమంతా క్రాంతిమయం!

భరతవాక్యం

జీవితమే చీకటి వెలుగుల చిద్రూపం
జీవికెరుక లేని సుఖదుఃఖాల సమ్మేళనం
ఒక నాటికి ఉద్భవిస్తుంది ఆశాజ్యోతి
సమాజానికి ఊపిరిస్తుంది ఆశాక్రాంతి.

(అందరూ నవ్వుతూండగా తెర పడిన శబ్దం.)

—————— × ——————

అనంతపురంజిల్లా పెనుకొండ తా॥ నల్లగొండ్రాయనిపల్లెలో 8-11-1936న శ్రీమతికృష్ణమ్మ, వెంకటప్పగార్లకు జన్మించిన గంగప్ప, పెనుకొండ, అనంతపురం, విశాఖలలో చదివి,1960 లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తునుంచి బి.ఏ. ఆనర్స్/ఎం.ఏ. తెలుగు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైన వీరు 1972లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్.డి పట్టం పొందారు.

1960 నుంచి 1978 వరకు అనంతపురం, కాకినాడ, విశాఖపట్నం, హైదరాబాద్ ప్రభుత్వ కళాశాలల్లోను, కర్నూలు సిల్వర్‌జూబిలీ ప్రభుత్వం కళాశాలలోను ఆంధ్రోపన్యాసకులుగా, శాఖాధ్యక్షులుగా ఉద్యోగం కొనసాగించి 18 ఏళ్ళ అనుభవంతో పదిగ్రంథాలు ప్రచురించిన గ్రంథకర్తగా వీరు 1978లో నాగార్జున విశ్వవిద్యాలయంలో ఆంధ్రోపన్యాసకులుగా ప్రారంభించి, 1983లో రీడర్ పదవిని, 1988లో ప్రొఫెసర్ పదవిని చేపట్టి, 1989-91లో శాఖాధ్యక్షులుగా, 1994-96లో పాఠ్యనిర్ణాయక సంఘాధ్యక్షుడుగాకొనసాగి 1996నవంబరు 30న పదవీవిరమణానంతరం గుంటూరులో విశ్రాంతి పుచ్చుకొంటున్నారు.

అనేక సాహిత్యపత్రికల్లో వివిధాంశాలపై దాదాపు 500వ్యాసాలు, సాహిత్య, భాషా,పరిశోధన విమర్శక,సృజనాత్మకగ్రంథాలు 50పైగారచించి, అనేక సాహిత్యసదస్సుల్లో,గోష్ఠుల్లో,చర్చల్లో పాల్గొని వివిధాంశాలపై పత్రసమర్పణ చేసి, ఉస్మానియా, శ్రీ వేంకటేశ్వర, తెలుగు విశ్వ విద్యాలయాల్లో పునశ్చరణ తరగతుల్లోను, విజిటింగ్ ఫెలోగా కాకతీయ విశ్వవిద్యాలయంలోను, యు.జి.సి. జాతీయ అధ్యాపకుడు (U.G.C. National Lecturer) గా అలీగఢ్, బెనారస్, మద్రాసు, తెలుగు విశ్వవిద్యాలయాల్లోను అనేక సాహిత్యాంశాలపై ప్రసంగాలు చేశారు; అలీగఢ్, బెనారస్, ఉస్మానియా, కాకతీయ, శ్రీకృష్ణదేవరాయ, నాగార్జున, తెలుగు విశ్వ విద్యాలయాల్లో పాఠ్యనిర్ణాయక సంఘ సభ్యులు. 1994-96లలో ఇంటర్మీడియట్ బోర్డు తెలుగు పాఠ్యనిర్ణాయక సంఘం అధ్యక్షులు, ప్రధాన సంపాదకులు. 1992-96లలో తెలుగు విశ్వవిద్యాలయం అకడమిక్ సెనేట్ సభ్యులు. 1993-95 లలో యు.జి.సి. రీసర్చి అసో యేట్స్, మేజర్ రీసర్చి ప్రాజెక్ట్స్ ఎంపిక సంఘం సభ్యులు. 1994 నుంచి భారతీయ జ్ఞానపీఠ్ అవార్డుకై తెలుగుభాషకు సంబంధించిన సూచన సంఘంలో సభ్యులు.

వీరు అర్ధశతాధికంగా గ్రంథరచన చేసి ప్రకటించడమేగాక వీరి పర్యవేక్షణలో వివిధ సాహిత్యాంశాలపై 27పిహెచ్.డి.డిగ్రీలు, 20ఎంఫిల్.డిగ్రీలు పరిశోధక విద్యార్థులు పొందారు. 1972, 1981 సం॥లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ- క్షేత్రయ్య పదసాహిత్యం, తెలుగులో పదకవితలకు రెండు అవార్డులు, 1984లో వేయిపడగలు-విశ్లేషణాత్మక విమర్శకు విశ్వనాథ సాహిత్యపీఠం అవార్డు, 1989లో యు.జి.సి. జాతీయ అధ్యాపక అవార్డు, 1991-92లో ఉత్తమ అధ్యాపకులుగా ఆంధ్రప్రదేశ్ స్టేట్ అవార్డు, 1991-92లో ఉత్తమ పరిశోధనకు తెలుగు విశ్వవిద్యాలయం తిక్కవరపు రామిరెడ్డి స్మారక ధర్మనిధి అవార్డు, 1993 అన్నమాచార్య ప్రముఖ వాగ్గేయకారులు- తులనాత్మక అధ్యయనం గ్రంథానికి తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు, ఇంకా అనేక పురస్కారాలు, సత్కారాలు, సన్మానాలు పొందారు. వీరిసృజనాత్మక రచనల్లో ప్రస్తుత గ్రంథం "దేశం బాగుపడాలంటే" నాటికల సంపుటి.